శ్రీ

# కల్యాణరాఘవము

ఆఱంకముల నాటకము.

ఇది



ప్రచండచాణక్యము ; నర్మదాపురుకుత్సీయము మొదలగు

నాటకములరచించిన,


పానుగంటి లక్ష్మీనరసింహారావుగారిచే


రచియింపఁబడి,


తమకు

శ్రీసాంబమూర్తిముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి

ప్రకటింపఁబడియె.

1915.





మొదటికూర్పు 1000 ప్రతులు.





వెల 0—౮—0.

# పీఠిక.

శ్రీకల్యాణరాఘవమను నీనాటకమును 1910సంవత్సరములో నే నానెగొందిసంస్థానముననున్నప్పుడే యారంభించితిని. కాని మొదటి యంకముమాత్రమే యప్పుడు వ్రాసితిని. 1911వసంవత్సరములోని జనవరినెలలో శ్రీఉయ్యూరుసంస్థానప్రభువులగు శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరుగారి ప్రోత్సాహమున మిగిలినయంకములవ్రాసి పూర్తిచేసితిని. ఇదివఱకుఁ బట్టభంగ, వనవాసవిజయరాఘవముల వ్రాసియుంటిని కాన దీనిలో శ్రీమద్రామాయణమునందలి షట్కాండముల లోనికథను రూపకరూపముగ నొనరించినవాఁడనైతిని. ఉత్తరరాఘవమును వ్రాయఁదలఁచుకొనలేదు.

నన్నుఁ బోషించుప్రభువులగు శ్రీరాజా వేంకటకుమార మహీపతి సూర్యరావుబహద్దరు వారీగ్రంథమును దమసొమ్ముచే నచ్చుయించిరి. ఆంధ్రభాషాభిమానులు, ననేకకవిపండిత పరిపోషకులు నత్యంతవితరణశీలురు, శ్రీపీఠికాపురసంస్థాన ప్రభువులునగువీరికి, వీరి కుటుంబమునకు, శ్రీపరమేశ్వరుఁడు దీర్ఘాయురారోగ్యసకలసంపత్సౌఖ్య సమృద్ధులనిచ్చి రక్షించుగాక.

శ్రీరామకృష్ణపరమహంసచరిత్ర శ్రీగౌరాంగచరిత్రాద్యుత్తమ గ్రంథరచయితలును, నాకుఁజిరకాలమిత్రులునగు బ్రహ్మశ్రీ కూచి నరసింహముగారు దీనికి నాందీప్రస్తావనలను వ్రాసియిచ్చిరి. వారికనేక వందనము లాచరింతును.

12—3—15
పిఠాపురము.

పానుగంటి లక్ష్మీనరసింహరావు.

## ఈనాటకమునందువచ్చు పాత్రములు.

---

### పురుషులు.

దశరథుఁడు—కోసలదేశాధిపతి.

| | | |
|---|---|---|
| రాముఁడు— | } | దశరథపుత్త్రులు. |
| లక్ష్మణుఁడు— | | |
| విశ్వామిత్రుఁడు— | } | మునులు |
| వశిష్ఠుఁడు— | | |

నారాయణుఁడు—విశ్వామిత్ర శిష్యుఁడు.

శతానందుఁడు—జనకుని పురోహితుఁడు.

శంకరుఁడు—వశిష్ఠ శిష్యుఁడు.

జనకుఁడు—మిథిలానగరాధినాథుఁడు.

శతానందుఁడు—జనకునిపురోహితుఁడు.

### స్త్రీలు.

| | | |
|---|---|---|
| కౌసల్య— | | |
| సుమిత్ర— | } | దశరథునిభార్యలు. |
| కైక— | | |

కావేరి—కౌసల్యదాసి.

రుధిర—కైకదాసి

తాటక—రాక్షసాంగన.

సీత—రామునిసతి.

మృదుల—సీత చెలికత్తె.



శ్రీ

# కల్యాణరాఘవము.

## ప్రస్తావన.

### నాంది.

మ. నవనీరోపమకాయుఁ డాబుడుతఁడై ♦ న, న్యారిశౌర్యంబుతో
సవనంబున్నెఱవేర్చి, గాధిసుతుని ♦ స్సంతుష్టుఁ గావించి, శం
భువుచాపంబవలీలఁ ద్రుంచి, సిరియౌ ♦ భూపుత్త్రిఁ గొన్నట్టి, రా
ఘవరాముండు, దయాబ్ధి మీకొసఁగుత ♦ న్గల్యాణముల్నిత్యము౯.

(నాంద్యంతమున సూత్రధారుఁడు తెఱవంకఁ జూచి)

సూత్ర—నటీ! ఇటొకసారి రమ్ము.

(ప్రవేశించిన నటిం జూచి)

ప్రేయసీ! పానుగంటి లక్ష్మీనరసింహరావుగారు పండ్రెండవ నాటక మొకటి క్రొత్తగ వ్రాసినారు. తత్ప్రదర్శనకార్యమందు నీవు నాకు సహాయురాలవగుదువను నాశతో నిన్నిప్పుడు పిలిచితిని.

నటి—అసహాయశూరులకు సాహాయ్యము నిమిత్తమాత్ర మైనను నాయందలిదయచే, గౌరవముచే నన్నుఁ దోడ్పడుమంటిరి. కాని యానాటక మేదో సెలవిచ్చెదరా?

సూత్ర—

గీ. పరిధితరామాయణ గ్రంథ ♦ బాలకాండ
మందలికథను దెల్ప్ క ♦ ల్యాణరాఘ
వంబునానొప్పు నొకనాట ♦ కంబు కంబు
కంఠి ! యిది, సర్వశుభదాయ ♦ కంబు మనకు.

నటి—(నవ్వుచు) ఇచటనా ? అచటనా ?

సూత్రి—అట్లనెదవేమి ?

నటి—ఇచటనేయయినయెడల, నెన్ని నాటక ప్రదర్శనములు గావించినను గనుబొమలమీఁది వానివలెనొక్కరీతిగ నుంటిమికదా?

సూ—ధనవంతులము గాలేదనియా నన్నుఁ బరిహాసించు చున్నావు?

ఆ॥ ధన మెసుఖదమంచుఁ ♦ దలఁతు వే,ధనులలో
నతిదరిద్రులుంటు ♦ నధికదుఃఖు
లైనవారుగలరు; ♦ కానసుఖంబునొ
సంగఁదృప్తికిలను ♦ సాటిలేదు.

న—ప్రశ్నోత్తరసందర్భము బాగుగనున్నది! అటు లేనిచో "సర్వశుభదాయకము" తృప్తిగావలయునుఁగాని నాటక మెట్లగును?

సూ—నీ సొమ్మెమగుబంటచిక్కులు పెట్టుకొంటెవుసుమా !

గీ. దేనిచేసర్వసుఖములు ♦ మానవునకుఁ
జేకురునొయట్టితృప్తిఁదె ♦ చ్చియిదునీవ
విత్యనాటకమందుచే ♦ వివిధసౌఖ్య
దాయకంబిదియనవచ్చుఁ ♦ దోయజాక్షి॥

న—సరే! తెలిసినది, లేనివియున్నట్లు తలఁచుకొనిసంతసిం

చుటుకొదాతృప్తి! అట్టిభావనాజన్య మహానందప్రవాహంబున నోలు
లాడ్చునాటకముగాన "సర్వశుభప్రద" మంటిరి కాఁబోలు.

సూ—ఓ! గడుసుదానా! నన్నెక్కడనుండి యెక్కడకీడ్చుకొనిపోవుచుంటివి! పావనగ్రంథసంభాషణము భావజానందములో విరమింపఁజేసితివే! నీవే నన్ను జయించితివి. పోనిమ్ము. ఈప్రపంచమందాఁడు వారికోడనివా రెవరు?

గీ. కూ్రరనారాచవితతికి, ♦ ఘోరకదన
రవములకు, జంకనట్టిపే ♦ రపురుషుఁడును,
గలికికొ్రవ్వాఁడిచూపుఁదూ ♦ పులకు, ఁజిలుక
పలుకులకుఁ సోలిదాసుఁడై ♦ పడునుగాదె!

నటి—మీరుమాత్రమాఁడువారుకారా? కల్లమీసములతోఁ గట్టుకత్తులతో నాఁడువారాఁడువారికోడిరి. దానికేమిగాని, యీశృంగార ప్రసంగమింతటితోఁ గట్టిపెట్టి, కథానాయకుఁడును బతితపావనుండు నగు శ్రీరామచంద్రమూర్తింగూర్చి యొకింత చెప్పుఁడు; డదివిని నాటక ప్రదర్శనమునకుఁ బోయెదను.

సూత్ర—ప్రియురాలా! మంచిత్రోవకు వచ్చితివి. శ్రీరామమహిమ యడుగుటకుం జెప్పుటకుఁగూడఁ దగినది. కానిపూర్ణముగఁ దృప్తికరముగ వర్ణింప నా కశక్యము.

గీ. అవనిరక్షింపదయతోడ ♦ నవతరించి
స్త్రియౌసచ్చిదానంద ♦ మైనతండ్రి,
రామచంద్రుఁడుమనయంత ♦ రంగములకు
లొంగని యామేయుఁడెట్లు ప ♦ ల్కులకులొంగు!

గీ. కానిపూర్వపుణ్య ♦ కర్మ ఫలంబున
ననుభవింపఁ గలిగి ♦ రామహాత్మ్య
మైనిగల్గు భక్తి ♦ వలన జనించిన
యమృతమంజనా సు ♦ తాదు, లింతి!

మఱియు, నాబహిఃప్రాణమా! ఒక రహస్యముఁ జెప్పెద వినుము.

సీ. జనకాది బంధు నా ♦ శనవిపన్మగ్నులై
దిక్కులేకేడ్చెడు ♦ దీనులకునుఁ
బట్టినదెల్లను ♦ భస్మమైపోయెడు
భగ్నసంకల్ప ని ♦ ర్భాగ్యులకును,
వచియింపరాని దు ♦ ష్పాతకంబులుసల్పి
కుళ్ళికుళ్ళి తపించు ♦ కుజనులకును
జదివినకొలఁదిని ♦ సందేహచిత్తులై
యూఁగులాడువిపశ్చి ♦ దుత్తములకు.
ఆ.వె. నట్టియిట్టివారి ♦ కననేల? నానా, భ
వార్తులైనవారి, ♦ కమృతసౌఖ్య
కాములెల్లరకును ♦ గనకాంగి! గట్టిగా
నసుమ్మ! దిక్కురామ ♦ నామమొకటె ||

న—ఔను, నాథా! ఈయన రామాయణ నాటకములందు చోనాకుఁ గాయకష్టములుగూడ నగపడుటలేదు.

సూత్రి—ప్రియురాలా! అదియొక వింతగాదు.

గీ. మనసునకు దేహంబునకు స ♦ బంధమున్న
యంతదాఁక నెతను బాధ ♦ లంటు నరుల;
భక్తిభరితాత్మ తనువును ♦ బాసియుండు
వేళఁగునో, తను బాధలు ♦ స్వాదునప్రు

నటి—ఆహా! ప్రాణేశా? ఈరామాయణనాటకము లుభయ తారకములుగదా!

సూత్రి—నిన్నును నన్నే కాదు. లేఖకపాఠకదర్శ ప్రదర్శకాదులనందఱం దరింపఁజేయ సమర్థములు.

నటి—నిజముగాం నేనెంతో ధన్యురాలను.

గీ. దశరథక్ష్మాతలేంద్రుండు ♦ తనసతులకుఁ
దెచ్చిపాయస మర్మిలి ♦ నిచ్చినట్లు
నాకుఁ గరుణించి యిడితిరి ♦ నాథ! యిపుడు
పరమపావనమౌ రామ ♦ భక్తిసుధను.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

---

శ్రీ

# కల్యాణరాఘవము.

## ప్రథమాంకము.

(ప్రవేశము — దశరథుఁడు, కౌసల్య, సుమిత్ర. కైక.)

దశ — సతులారా! ఋశ్యశృంగువారి ప్రావీణ్యమునఁ జేసిన జన్నము దైవకటాక్షమునఁ బూర్తియయినది. ఇదిగో పాయసము. యజ్ఞదేవ దత్తప్రసాదము. దీనిని మీరు భుజియించి గర్భముల ధరింపుఁడు.

కౌ — మేమందఱము మడుఁగుబట్టలధరించి శుచిగ నున్నారము. తామే మాకొసఁగుఁడు. భుజింతుము.

దశ — కౌసల్యా! ఈపాయసమున నీకెంత కావలయును?

కైక — ఏమైన మధురపదార్థ మితరులకుఁ బంచియిచ్చుచో ముందుగాఁ జిన్నవారిముచ్చటఁ దీఱుట మంచిపని కావున నాథా! మీరు మాయక్కగారి నొసఁగిన ప్రశ్నమును నన్నే యొసఁగిన యెడల నెంతకంటె బాగుగ నుండునేమో?

దశ — కైకా! కేవల రుచిప్రధానమై కడుపు నింపించుకొనుటకుమాత్రమే పనికివచ్చు నైహిక పదార్థమును బంచిపెట్టునపుడు నీవనినట్లు చేయవచ్చునేమోకాని దైవప్రసాదితమగునీపవిత్రవస్తువును గూర్చి నీవు చెప్పినయేర్పాటు పనికిరాదేమో!

కై—దైవప్రసాదమునకందఱును సమానస్వత్వులే కదా! అట్టిచోట బెద్దచిన్న భేదమేల చేయవలయును? కావున ముగ్గురకు సమానముగా బంచిపెట్టుము.

సు—చెల్లెలా! వారి యిష్టానుసారము వారే యాచరింతురు. నీబోధనమేల?

కై—నేను నీకేమియు బోధింపలేదు. నీవు నన్ను మందలింప వలసినపని లేదు.

కౌ—(అపవారించి సుమిత్రతో) చెల్లెలా! నీవూరకుండుము. మనకు భర్తతోఁగాని చెల్లెలితోఁగాని వాదమెందులకు? ఏదైన కిటాకుముననే పాయసపాత్రము నాథునకులభించినదో యాదైవకటాక్షముచేతనే యదిమనముగ్గురకు దైవమువిధించిన యేర్పాటు ననుసరించియే సిద్ధించును.

సు—(అపవారించి, కౌసల్యతో) అంటరకంటె భర్తకధికానురాగాస్పదమ ననికాఁబోలు నీతివాక్యబోధనమారంభించినది.

కౌ—(అపవారించి సుమిత్రతో) భర్తయందుఁగల చనవున నామె యేమయినఁ బల్కినచో మన మన్యథా నెంచఁదగదు.

కై—నాథా! ఊరకుంటిరేల? ముగ్గురకు మూఁడుసమభాగములు చేసి యిచ్చుటయే న్యాయముకాదని తోచినదా యేమి?

దశ—కైకా! అట్లు తోఁచినఁ దప్పుగాదని తోఁచుచున్నది.

కైక—అటులైన నాకందరకంటె దక్కువ నిచ్చెదవా?

సు—చెల్లెలా! ఈపాయసముతో నాఁకలిదీర్చుకొనఁదలఁచితివా? ఇది దైవదత్తమగు పదార్థము. కొంచెము భుజించిననేమి? విశేషముగ భుజించిననేమి? గిండెడు పాలగాఁ్రమతీర్థముఁ ద్రాఁగినఫలమొకయుద్ధరిణెఁడుతీర్థము ద్రాఁగిన ఫలముకంటె నెక్కుడగునా?

కౌ—(అపవారించి) చెల్లెలా! అడుగనిదే నీవేలమాటలాడెదవు?

కై—అక్కా! మీరిద్దఱు జ్యేష్ఠదేవులు. మీరు పెద్దవంతులు వచ్చునుగదాయను ధైర్యముతో నెన్నిశ్రీరంగనీతులయినఁ జెప్పఁ గలరు. నేను గనీయసురాలను. కనిష్ఠురాలను. అధమురాలను. నీచురాలను. పాపాత్మురాలను. మీరిద్ద రారగింపఁగా నేదయిన నొక్క యుచ్ఛిష్టపిండగువుమిగిలిన నది మీయిద్దఱప్రసాదమనియెంచి కన్నుల కద్దుకొని తినవలసినదానను.

దశ—కైకేయీ! ఎందులకీకోపము? చూడుము. (చేయి పట్టుకొని) నేనుఁ జెప్పినమాటవినుము.

కైక—ఒక్కనీవు చెప్పినమాటల వినుతోడనే నాబ్రదుకు తెల్లవారునా? ఈయక్కగారు చెప్పినమాట వినవలయును. ఆయక్కగారు చెప్పినమాట వినవలయును. కనిష్ఠురాలనై నీయింటఁ బ్రవేశించిన దోషమునకు నాకేదిచిన్నతనముతప్పును? అనురాగములలోఁజిన్నతనము. ఆదరణములలోఁ జిన్నతనము. ముచ్చటలలోఁ జిన్నతనము. ముద్దుపులలోఁ జిన్నతనము. మాటలలోఁ జిన్నతనము. మర్యాదలలోఁ జిన్నతనము. బ్రదుకంతలోఁగూడఁ జిన్నతనము. పరములోఁ గూడఁ జిన్నతనము.

సుమి—(తనలో) కానిచుఅచుఅచూపులలోఁ బెద్దతనము. సూడుమాటలలోఁబెద్దతనము. బుడిబుడియేడుపులలోఁ పెద్దతనము. బూకరింపులలోఁ బెద్దతనము. గయ్యాళితనములలోఁ బెద్దతనము. గడుసుదనములలోఁబెద్దతనము. కొఱమాటలలోఁ బెద్దతనము. కాటులాటలలోఁ బెద్దతనము

దశ—(అపవారించి) కౌసల్యా! నీకెంతవంతు కావలయునని యడిగితిని. చెప్పనేతివేమి?

కౌ — (అపవారించి) మానాథులు కైకేయి కోరినంతవంతు నామెకిచ్చి మిగులుదానిలో మీకుం దోఁచినంత నాకుం గటాక్షింపుఁడు.

కై — అక్కా! నాకు వంతు నీయవలదని భర్తతో రహస్యముగఁ జెప్పుచున్నావా?

కౌ — చెల్లెలా! నీకే పెద్దభాగము నీయవలసినదని చెప్పుచున్నాను.

కై — నాకంత యాస లేదమ్మా! నాకట్టి పేరాస లేదమ్మా! నాకట్టి దురాశ లేదమ్మా! పెద్దవారైన మీకే పెద్ద పెద్దయాశలుండును గాని—

సు — చెల్లెలా! ఎందుకమ్మ నిందింతువు? భాగములఁ గూర్చి భర్తగారితో మేమేమైనఁ బ్రస్తావించితిమా? పెద్దవంతులని చిన్నవంతులని సమభాగములని లేనిపోని సిద్ధాంత పూర్వపక్షములన్ని నీవే చేయుచున్నావుకదా! మేమేమైన మాటలాడితిమా?

కై — అబ్బో! మీరు సంగనాచులు. నాలి ముచ్చులు. చలిచీమలు. సన్నసన్న సన్నాయినొక్కులజాణలు. నన్ను భగవంతుఁడు పెద్దగొంతు, పెద్దకడుపు, పెద్దయాశతో సృష్టించినాఁడు. పాత్రము లోని పరమాన్నమునంతయు నేనే భక్షింపవలయునని యేడ్చుచున్నాననుకొంటిరేమో! నాకేమియు నక్కఱలేదు. మీరిద్దరే భుజింపుఁడు. మీరిద్దరే పుత్త్రులఁ గనుఁడు నాథా! నేను బోవుదును.

(పోఁబోవును.)

దశ — (ఉస్సురనుచు) అబ్బ! కైకేయీ! ఆగుము. ఎప్పుడును గోపమేనా?

సుమి — (తనలో) బెదరింపులేగాని యెక్కడకుఁ బోవును?

కౌ — (కైకనుఁ బట్టుకొని) చెల్లెలా! పోకుము. దైవప్రసాదిత

పదార్థమును నిరాకరించుటదోషము. అమ్మా! నీయిష్టమువచ్చినంత భాగమును నీవు తీసికొనుము. మిగిలినదే మేము భక్షింతుము.

కై — సన్నాఁపకుము. అమ్మా! అంతయు మీరే తీసికొనుఁడు. నాకేమియు నక్కఱలేదు. మీకుఁగలుగు పుత్త్రులు నాపుత్త్రులు కాక పోవుదురా?

సుమి — చెల్లెలా! నీకుఁగలుగు పుత్త్రులు మాకు మాత్రము పుత్త్రులు కాక పోవుదురా? నీకింతకోపమెందులకు? నీవక్కటే భుజింపుము.

దశ — (చేయిపట్టుకొని) కైకా! పుత్త్రభిక్షకై నేను దేవునెంత ప్రార్థించితినో నా మనస్సునకుఁ దెలిసిన పుత్త్రునిగనవలసినదని నిన్నెంతకంటె నెక్కువగఁ బ్రార్థింపవలయునా?

సుమి — (తనలో) నాథా మీకీలాగునను దప్పదు. విశేషమేమన మేముగూడఁ బ్రార్థింపవలసివచ్చినది.

కైక — నాథా! పొడిపొడిమాటలచే సంతోషపెట్టఁ బ్రయత్నింపకుము. నేనెంత జాలిమనసు గలదాననయినను నీవియగు పై ప్రార్థనములు లోసితూష్ణీంభావములు, పై కిచకిచలు, లోని ధుమధుమలు, పై మమకారములు లోని వెటకారములు, పైగోడు, లోని సూడు, తెలియలేనంతమందబుద్ధినిగాను. పాయసమిచ్చుటలో నీకుఁబక్షపాతముదయించినది.

దశ — పక్షపాతముగగాక సరిగఁబంచియిచ్చెదను.

కైక — సెబాస్. సరిగనిచ్చెదవుకాదా? ఇమ్ము. వలదనినవారెవరు?

దశ — "సరిగ" సనఁగ నీయభిప్రాయమేమి?

కైక—ఇదిగో ఏ పెద్దల కధికభాగములనిచ్చి యధికులఁజేసి నన్నన్నివిధములఁ జిన్నసేయఁ దలఁచితివో యట్టి మాయక్కలనే యడుగుము.

దశ—ఏమి? సుమిత్రా! నీయభిప్రాయమేమి?

సుమి—నేను పెద్దనుగాను; చిన్ననుగాను. నడిమిదానను. నన్నడుగనేల?

దశ—సతులారా! మీలో మీరు నిష్కారణముగ వైరమొంద వలదు. నేను సరిగఁ బంచియిచ్చెదను.

కైక—"సరిగ" యనఁగ సమభాగములుగ ననిమీయభిప్రాయ మగునెడలఁ గానిండు.

దశ—సరిగ యనఁగ న్యాయముగ.

కైక—న్యాయమనఁగ నేమి? మీబుద్ధికి న్యాయమా? మా అక్కలబుద్ధికి న్యాయమా? నాబుద్ధికి న్యాయమా? దైవబుద్ధికి న్యాయమా? ఎవరుచెప్పిన న్యాయము? ఏటిన్యాయము? పాయస ప్రదాతయగు యజ్ఞదేవుఁడీ పదార్థమును మాముగ్గుర కొసఁగుమని నాఁడా? లేదా?

దశ—అట్లే సెలవిచ్చినాఁడు.

కైక—అంతేకాని బుద్ధిచేత నాలోచించి న్యాయమని తోఁచిన కొత్తన్యాయము ననుసరించి కొందఱను సంతోషించి పుత్రకుఁ బట్టము నేడ్పించి యిమ్మని యిన్నిమాటలు చెప్పినాఁడా? ఏమి? మాటలాడ రేమి?

దశ—అట్లు సెలవీయలేదు.

కైక—లేనియెడల నింత సందేహమేల? ఈ యోజనమేల? ఈతొట్రుపాటేల? నానోరు కొట్టవేయనేల?? మీరన్నన్యాయము

న్యాయముకాదు. పెద్దభార్యకొక్క న్యాయము. మాయక్క చెప్పినట్లు నడిమిభార్య కొక్క న్యాయము చిన్నభార్య కొక్క న్యాయమునా? దైవప్రసాదమున కందఱు సమానార్హులను లోకన్యాయము ననుసరించి పంచిపెట్టుము.

దశ — కైకా! బ్రాహ్మణుల కనేకపర్యాయములు నీవుదాన దక్షిణాదుల నిప్పించితివి కాదా! పెద్దలకు చిన్నల కొకరీతినే యిప్పించితివా?

కైక — బ్రాహ్మణులకిచ్చినది నాసొమ్ము. నాసొమ్మును నా యిష్టానుసారముగఁ బంచియిచ్చెదను. నాయనుగ్రహము ననుసరించి యిచ్చెదను. నీభండారములోని సర్వధనమును మాయక్కలకిచ్చిననైన నేను నోరెత్తుదునా? నీవు నన్నునిరాకరించి మాయక్కలతోడనే కాలక్షేపముచేసినను నేను దైవమును దూఱుచు నీపాదములయొద్దఁబడి యుండుదాననే కాని యిదియేమియని పలుకవలసిన దాననా?

సుమి — (తనలో) అబ్బ! ఏమిశాంతచిత్తత! ఏమిసహనశక్తి! అటులే నాథుఁడు చేసినయెడల యీసాకేతపురినిసమూలముగా సముద్రమునఁగలుపకమానునువా? కైకమ్మతల్లీ! నాథుఁడునీయెడల నత్యనురాగుఁడై మాయెడల నొకరీతిగనున్నను మాకు నాథునికిఁ గూడఁ జీవాట్లుతప్పలేదమ్మ్యా.

కైక — నీయనుగ్రహమును గనఁబఱచుటకు నీయిష్టమునుఁ జూపుటకు నీన్యాయమును జరుపుటకు సంభావనకువచ్చిన ముష్టిబాపనయ్యలకువలె మేము నీబంగారమపేక్షింపలేదే? నీసొమ్ములఁగోరలేదే? నీవస్తువేదియును దేవురింపలేదే?

దశ — ఈపరమాన్నము నావస్తువుకాదా?

కైక — ఎట్లు?

దశ — (నవ్వుచు) యజ్ఞపురుషుండు నాకొసంగుటచే నాది.

కై — మిమ్ము దినుమని మీకిచ్చెనా?

దశ — (నవ్వుచు) నీవు నన్నిట్లు వేడుకొని తినుటకు నాకిచ్చినావు. తెలిసినదా?

సుమి — (తనలో) మాతో పాటు.

కైక — నానా ఎంతధర్మశీలుండవు! నావిమీదియను భేదమునుం జేయుచుంటివి. నీయర్ధశరీరిణులమే! నీసహధర్మచారిణులమే! పుత్త్రభిక్షంగోరి మీతోపాటు యజ్ఞము మేముగూడ జేయలేదా? మీవలెనే యజ్ఞదీక్ష మేముగూడ నెఱపలేదా? మీవలెనే మేముగూడ యజ్ఞదేవుం బ్రార్థింపలేదా? ఆయజ్ఞఫలమగు నీపాయసపాత్రవస్తువు నీకొక్కనికీయంబడినదా? అందుచేనిదా? అటుకాదు అదిమాకొఱకు నీచేతికీయంబడుటచే నీదిగూడనయినది. కాని నీకీయంబడుటచే నీదయి నీవుమాకిచ్చుటలేదు. మాకిచ్చినది యజ్ఞపురుషుండే, [illegible] జ్యేష్ఠా మధ్యమా కనిష్ఠాభేదమాయనకు —

దశ — సరే. ఆయనకు లేదు. మీకట్టిభేద మున్నదందువా? లేదందువా?

కైక — మీప్రశ్నము నాకు బాగుఁ దెలియుటలేదు.

దశ — సుమిత్రా! నాయభిప్రాయమును నీ చెల్లెలికిఁ జెప్పుము.

సుమి — చెల్లెలా! నీవందఱకంటెఁ జిన్నదానవనియు నీకంటె నేనుం బెద్దదాననయియు నీవు సర్వజ్యేష్ఠురాలవనియు భేదము మనలో నున్నదా లేదా యని యడుగుచున్నారు.

కైక — అట్లు వ్యత్యాసము లేకేమి?

దశ — కావున నేనొక్క సంగతిని చెప్పెదను. విను ఒక పవు గడియసేపు మీరు సవతులమనుమాట మఱచిపొండు. మీరొక్క తల్లి బిడ్డలనియెంచుకొనుఁడు. అన్యోన్య ప్రేమాధిక్యముకలవారని యనుకొనుఁడు. కైకా! ఈపాయసపాత్రము నీచేతికిచ్చెదను. నీవే పంచి యిచ్చుటకు నేనంగీకరించెదను. ఎట్లు పంచియిచ్చెదవో చెప్పుము?

కైక — మేము ముగ్గురము సమముగఁ బంచుకొందుము.

దశ — అట్లు చేయునెడల నీయక్కలయందేమి యౌదార్యమును గనఁబఱచినదానవగుదువు. అదితప్ప కౌసల్యా! నీవు పంచునెడల నెట్లు చేసెదవు?

కౌ — అందఱకంటెఁ జిన్నచెల్లెలగు కైకకుఁ బెద్దభాగమిచ్చి సుమిత్రకు నంతకంటెఁ దక్కువనిచ్చి యంతకంటెఁ దక్కువభాగము నేను దీసికొనెదను.

దశ — సుమిత్రా! నీవు పంచునెడల నెటుచేసెదవు?

సుమి — (నవ్వుచు) నాకేమియునుంచుకొనకుండ నీయిద్దఱకు జెఱియొకసగమిచ్చెదను.

దశ — నీకో!

సుమి — పిదప వారిభాగములలోఁ జెఱియొకసగమును బుచ్చుకొందును. (నవ్వను)

దశ — ఎంతగడుసుదానవు! సతులారా! ఇదివఱకే పృథగ వాలస్యమయినది. ఇఁక నీపదార్థమును శీఘ్రముగ మీరనుభవింప వలయును. పెద్దభాగముఁ దినినదానికిఁ బెద్దకొడుకునుఁ జిన్నభాగ మును దినినదానికిఁ జిన్నకొడుకును బుట్టునా? కౌసల్య చిన్నభాగము దినినను నామెకుఁబుట్టుకొడుకు పెద్దకొడుకె. కైకా! నీవు పెద్దభాగ మును దినినను నీకుఁబుట్టుకొడుకు చిన్నవాఁడే అందుచేనీవు పెద్ద

భాగము పేక్షింపఁదగదుఅపేక్షించినలాభమును లేదు. కౌసల్యవయస్సుచే యోగ్యతచేఁగూడఁ బెద్దది చిరకాలము కాపురముచేసినది. పుత్త్రులు లేరని మీరియిరువురకంటె నెక్కువకాలము తెప్పించినది. మిక్కుటముగుటచే మీకుఁ బూజ్యురాలు. అందుపై మీయందు నింత రానురాగముగలది. ఎన్నఁడునుస్వలాభమును గోరుకొనియుండ లేదు. అట్టియీకౌసల్యాదేవిని నేను మీరుతప్పక గౌరవింపఁదగినది. మానల లోకులు మెత్తురు. మనతెరువాతివారు మనలఁగొనియాడుదురు. కైకా! మనసులో నేమియుంచుకొనకుము. పవిత్రమైన ముహూర్తము దాటి పోవుచున్నది. అట్లు తలవంచుకొనుటకాదు. నీచేయి నిటుదెమ్ము. కౌసల్యచేయి పట్టుకొనుము.

కై—(అట్లుచేయును.)

కౌ—చెల్లెలా! నేను వయస్సుచేఁబెద్దదాననయినను నీవే నాకంటెఁ బెద్దదానవుగ భావించినిన్ను గౌరవించుచున్నసంగతి నీ వెఱుఁగుదువుకదా! అట్టిచో ననవసరమగు నీగాధయేల? నీయిష్ట మెట్లో యట్లేకానిమ్ము.

కై—నేను దొందరపడి యేమయిననిన్నునినయెడల క్షమింపుము. (కౌసల్యను గౌఁగిలించుకొనును.) అక్కా! సుమిత్రా! నిన్నుఁ గూడ నిట్లే కోరుచున్నాను.

దశ—సెబాస్! కైకా! నీకు కోపమెంత శీఘ్రముగఁగల్గునో ప్రసన్నతకూడ నంత శీఘ్రముగనేకలుగును వెఱ్ఱికోపమెటులో వెఱ్ఱి దయయునటులే. ఈపాయసకలశము నీచేతిలోనుంచుకొనుము. ఇదిగో పంచుమంటిని. కౌసల్యా! నీకు దీనియందర్ధభాగము.

కౌ—మహాప్రసాదము.

దశ—మిగిలినయర్థభాగము రెండుభాగములు చేయుచున్నాను.

(చేసి) ఇదిగో! ఒకభాగము. సుమిత్రా! నీది. (సుమి గ్రహించును.)

సుమి—మహాప్రసాదము.

దశ—మిగిలిన భాగమును నీవు దీసికొందువా?

కైక—సుమిత్రనాకంటె పెద్దదయినందుల కామెకు నాకంటె కొంత యధికభాగము రావలదా?

దశ—అట్టులయిన నేమిసేయుమంటివి?

కైక—నావంతు రెండు భాగములు చేసి యొక భాగము సుమిత్రకిమ్ము.

దశ—సెబాస్! కైకా! సుమిత్రా! నీవనినట్లు నీకు రెండు వంతులు వచ్చినవి. తీసికో. నీకిద్దఱుకొడుకులు గలుగుదురేమో?

సుమి—(తనలో) ఇద్దఱు పుత్త్రులయినన రే! అనేక శిరస్సులుగలవాఁడయినపరే. కొడుకు పుట్టినఁజాలు.

కైక— నేనీ యష్టమభాగమును దీసికొందును.

దశ—కైకా! నీవు సంతుష్టినొందితివా?

కై—ఆ.

దశ—ఉత్తరక్షణమునుండి మనకు ముచ్చటలపై ముచ్చటలు. వేడుకలపై వేడుకలు. పండుగలపైఁ బండుగలు. ఇక్కడకు మనస్సు శాంతి పడినది. సతులారా! మీరింక భుజింపరేమి?

కౌ—ఇక్కడనేల? భోజనశాలలోనికిఁబోయి యక్కడ కలిసి భుజింతుము.

దశ—సరే. పోదము రండు.

(నిష్క్రమింతురు.)



శ్రీ

# కల్యాణరాఘవము.

## ద్వితీయాంకము.

(ప్రదేశము—వీధి. ప్రవేశము—కావేరి, రుచిర.)

కావే—రుచిరా! వేగరా! అట్లు లడుగులో నడుగు పెట్టెదవేల?

రుచి—మా యమ్మ కైకమ్మకుఁ గడుపుచేత మందగమనము వచ్చియుండ నాకుఁ గాలి పైకుసుపుచే వచ్చియున్నది.

కావే—ఇట్లిప్పటినుండి నేల తిరుగుచున్నావు?

రుచి—సుసుపుకంటె దానాని యెక్కువ సంబరపుచున్నదమ్మా!

కావే—మా కౌసల్యకుఁ గడుపు రాలేదా? సుమిత్రకుఁ గడుపు రాలేదా? కైకమ్మ వీటిద్దఱికంటె నెక్కువ సుకుమారియా? తానంత "అమ్మ ఉస్సు"ఁ బడుచున్నదఁటేమి?

రుచి—కావేరమ్మా! చెప్పిననమ్మవేమో కాని చూడు! ఎవరికోడలయినఁ దిరుగ నవలేదుసుమా! నాతో చేసరి. ఇదిగో! ఆ పాయసముఁ దిన్నమరునాఁటినుండియు మారంభము. ఒక్కటే వేవిళ్ళు! విని, విరామము లేదు. ఇటుగుటక. అటు "ఓక్కు" వెలుతురుకంటెఁ బడుటకు వీలు లేదుగదా! ఎవ్వరిని జూచిన నసహ్యతగదా! ఇదిగో

కావే — చదువుకొన్నవారు మీరెక్కడ గట్టుకొనినఁ గట్టుకొందురు; నా కెందులకమ్మా! నేను బోయెదను.

రుచి — వదినా! కోపమా! ఎచ్చటకుఁ బోదలఁచితివో చెప్పవా!

కావే — చెప్పుటకు రహస్యమేమున్నది? మాయమ్మ వసిష్ఠ భగవానుని యాశ్రమమునకుఁ బోయి వారచ్చటనున్నారేమో కనుగొనిరమ్మన్నది.

రుచి — ఎందులకో!

కావే — నాకుఁ దెలియలేదు.

రుచి — పుత్రుడు శీఘ్రముగ రానై యున్నదని సందేహముచే గురువుగా రింటనున్నారో లేదో కనుగొనుమన్నదేమో?

కావే — పురిటికిఁగావలసినది మంత్రసానియా? మహర్షియా?

రుచి — అదేమిమాట! శిశుజన్మకాలనిర్ణయము మొదలగు పనులకు గురువుగారుండవలదా? కానిమీయమ్మగారిప్పు డేమి చేయుచున్నారు?

కావే — నేనిటు వచ్చుచుండఁగనే మా చెల్లెలిని బిలిచి "రాజుగారి నిటకురమ్మని కోరితినని చెప్పుము" అని దానితోఁ జెప్పెను.

రుచి — సరి! ఇఁక నేమి. నేననినదే నిజము. ఈసరికి రాజుగారామెయొద్దకు వచ్చియుందురు. కావున నీవు వేగ పొమ్ము. నేనును బోయియేదియో యొక పుల్లని వస్తువును దీసికొని పోయెదను.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.



# ద్వితీయాంకము.

ప్రదేశము—కౌసల్యాంతఃపురము.

ప్రవేశము—దశరథుఁడు, కౌసల్య.

దశ—ఏల ?

కౌస—వంగి మీపాదములను శిరమున నద్దుకొనుటకు నాకు మిగుల గష్టముగనున్నది. అందుచే దయచేసి మీపాదములను నా తొడలపైనుంచుఁడు. చేతులనెత్తి కన్నుల కద్దుకొందును.

దశ—ప్రాణప్రియా ! నీవిప్పుడటులు చేయకున్న నేమి ?

కౌస—నాథా ! (గద్గదికతో) ఏమియు లేదు.

(కన్నుల నీరుంచుకొనును.)

దశ—ఆ! ఆ! అదేమి కౌసల్యా ! ఎందులకు ? (మొగము నెత్తి కౌఁగిలించుకొని) హా ! ప్రాణప్రియా !

గీ. చెప్పవా! చెప్పవా! నీకు ♦ గొప్పకనుల
కొలుకులను వేఁడి కన్నీళు ♦ లొలుక నేల ?
చెక్కు లెఱుపెక్క నేల ? ♦ సీత్కృతులఁ బె-
దవు లాడుల నేల గుండెల ♦ దడయ నేల ?

కౌస—(దైన్యముతో) నాథా ! నాకేమియుఁదోచుట లేదు. లోపల నేమియో యావేదనముగ నున్నది. గర్భమున నేదియో తళుక్కుమని ప్రవేశించినట్లున్నది. కనులు చీకటులు గ్రమ్మినవి. అమితముగ

గీ. యజ్ఞదేవ ప్రసాద మా ♦ హాత్మ్యమునను
జింతలకుగంటెనంచు నేనెం ♦ చితినిగాని
సతులు గర్భధారణకళా ♦ వతులు గాఁగ
నిప్పుడొకనూత్నచింత వే ♦ ధించునన్ను.

సీ. అంతంత మొగములై ♦ యంతంత బొమ్మలై
యంతంత యుదరంబు ♦ లైన వింత
యాకారములతోడ ♦ నేను ముక్కులఁబోలె
పలుచపల్చని వెల ♦ వెలలతోడ
నిదుర మబ్బులతోడ ♦ నిట్టూర్పుబుసతోడ
సిరుపట్టినకాళ్ళ ♦ బూరతోడ
మెలమెల్లనడురీఁత ♦ యలపులసొలపుతో
గాజుకాయలవలెఁ ♦ గానఁబడుచు
గుత్తుకుత్తను నిల్లాండ్ర ♦ గోడుచూడ
గుండెలు పటాలుమనుచుండు ♦ రెండుతలలు
నెప్పుడేర్పడు నెప్పుడు ♦ గుప్పుచప్పు
ననుబయటఁబడువారమో ♦ యనెడువగను.

గీ. ఏకసతియున్నవానికే ♦ యింతబాధ
యనఁగ ముగురున్నవాఁబ్రదు ♦ కడుగనేల?
ఉవిదలెందరున్నను సౌఖ్య ♦ మొకటెకాని
కుడుచు కష్టంబులెన్నియో ♦ నుడువనగునె?

గీ. ఇదియె తొలిచూలు వయసు గ ♦ తించువెనుక
రాక రాక యబ్రముగాఁగ ♦ బ్రాప్తమయ్యె
నేమగునోయంచుఁ గౌసల్య ♦ యిట్లువగచు
గోల! రెఱుఁగదు; సుకుమారి ♦ కోమలాంగి.

(ప్రకాశముగా) ప్రాణప్రియా! నీకేమియు భయము లేదు. దైవ కటాక్షమునఁ గులగురులగు వసిష్ఠభగవానుల యాశీర్వాదమున నీవు సుపుత్త్రిని నేఁడో రేపో కాంతువు.

కౌ—రేపటివఱకు నేనీబాధ పడుచుండవలసినదా? ఆ! నావలనఁగాదు.

దశ—(కౌసల్యను ముద్దిడుకొని)

గీ. వార్ధకము దరిసేరు సం • ప్రాప్తమైన
చాలుపుణ్యమాయని ముద్దు • రాలితనపు
నీదు ముద్దులుఁ జూలుఱంట, • నెఱిసొగసులు
మురిపములఁగాంచి తిరుగ ను • ప్పొంగుచుంటి.

కౌ—ఇప్పుడు పరిహాసించుచుంటిరా?

దశ—ప్రియురాలా! క్షమింపుము. ఇప్పుడు నేఁజేసిన పరిహాసమునకు నీకొడుకు చేయిఁబట్టుకొని యిట్టెయిట్టెముందునన్నుఁ దిట్టింతువుగానిలే. చూడు. (కడుపుపైఁ జేయివైచి)

గీ. కడుపులోఁ జిన్నిబుడుతఁడు • దుడుకుదుడుకు
మనుచునీటిలో మత్స్యంబు • ననువుఁదోఁప
దళుకు తళుకని స్ఫురియించి • తుళికరించు
మేఘగర్భస్థమగు నెఱి • మెఱుపుఁబోలెను.

కౌసల్యా!

గీ. ఎగుమొగంబగు గర్భంబుఁ • దిగఁబడియెను
డొక్కలెత్తును బొసిలోఁ • తెక్కెఁ గడుపు
బడిబడిగ బిగబట్టెను • ముడుగులివిగో
త్రుంకె పసిగనే ప్రసవింతు • వింకనేమి?

నీవు రేపటివఱ కుండనక్కఱలేదు. ఈదినముననే శుభప్రసవమగు దువుగాక! నీదాసి మొవతెయయిన నక్కఱదనున్నదా?

కౌ—అందఱను బంపివయిచితిని. ఏల?

దశ—ఏలయందువేల? పిలిపింపవలసినవారిఁ బిలిపించి, వల సిన సన్నాహమాంతయుఁ జేయింపనక్కఱలేదా?

కౌ—తొందరపడకుఁడు. ఎవ్వరిని బిలిపింపవలదు. ఇఁక గొంత సేపు చూతము.

దశ—ఇంకఁ జూచునదేమి. (గట్టిగ) కావేరీ!

(నేపథ్యమున) బాబూ! వచ్చుచున్నాను.

కౌస—దానితో నిందుకొఱకని చెప్పెదరాయేమి? వలదు.

దశ—దాసికయినఁ దెలియకుండనెటులు?

కౌ—ఇప్పటినుండియునా? ఈదాసులు చెవినిఁబడిన ముక్క నీటిపైఁబడిన నూనెచుక్క.

దశ—అటులయిన యిప్పుడేమిచేయుమంటివి?

(నేపథ్యమున) అమ్మా! లోనికిరావచ్చునా?

కౌస—కావేరీ! రావచ్చునుకాని నీవిచ్చటకువచ్చి చేయున దేదియులేదు. జపమగునెడలఁ బూజ్యురాలగు నరుంధతీదేవిగారిట కొకసారి దయసేయుదురేమో కనుఁగొనెదవా?

దశ—(నిమ్మళముగ) జపము వదలియయిన శీఘ్రముగనని చెప్పరాదా?

(నేపథ్యమున) అమ్మా! పోయి చెప్పెదను.

కౌ—సరే.

దశ—వసిష్ఠభగవానునకెప్పుడు వార్తనంపుదము.

కౌస—ఆమె పెద్దది. మిగులఁ దెలిసినది. వచ్చినతరువాతనన్ని యేర్పాటులును సందడి లేకుండ నామెయే చేయును.

దశ—సంతోషమె. నీకింక భయమేమియు లేదుకద.

కౌస—లేకేమి! ఇప్పుడంత బాధ లేకుంట చేస్థిమితతగనున్నాను. ఇదియంతయుఁ గడచి గట్టెక్కి తిరుగమీతో సుఖింపఁగలనా?

(నేపథ్యమున) ఆ! ఆ!

దశ—ఆహా! వింటివా? ఎట్టి సదుపశుశ్రీయయినదో.

కౌ—కావేరీ! ఆ. ఆ. యనుచున్నావేమి?

(నేపథ్యమున) దేవిగారు మహారాజుగారియొద్దనేయున్నారా? యని రెండవరాణిగారిదాసిగంగచేసిన ప్రశ్నమునకు ఆ. ఆ. యనుచున్నాను.

కౌ—భగవతియగు నామెతో మనవిఁజేసితివా?

(నేపథ్యమున) ఆ, వచ్చెదననినారు.

కౌ—తొందరగ దయసేయుమని చెప్ప లేదుకద.

(నేపథ్యమున) ఉ. హు.

కౌ—సరే. పోమ్మి. నాథా! నా చెల్లెలు సుమిత్ర నన్నుఁ జూచుటకయి రాఁదలచి దాసిచేవార్తనంపియున్నదికాఁబోలు. నేను సెలవు తీసికొనివెళ్ళనా?

దశ—నీవు వెళ్లుటయేల? ఆమెయేయిక్కడికు రాఁగూడదా?

కౌ—సరి.సరి. చాలులెండు. నాథా! నేనొకరహాస్యపుమాట నడిగెదను. చెప్పెదరా?

దశ—తెలిసినయెడల.

కౌ—సుమిత్రగర్భము కైకమ్మ నాగర్భములవలె లేదేమి?

దశ—లేక ?

కా—మిగులఁ బెద్దదిగానుంటయే కాక యాకృతి చేఁ గూడవింతగ నున్నది ఈపక్షిగూను బెరిగియున్నది. ఆపక్షిగూను బెరిగియున్నది. బొంతయరఁటిపండువలె నడుమగొంచెము వెలితిగనున్నది. ఎందుచేత?

దశ—ఆమె కవలపిల్లలను గాంచుననితోఁచుచున్నది.

కౌస—అమ్మయ్యో ! ఇద్దఱుపిల్లలే. నాకాఁడలు జలదరించు చున్నది. ఏమండి నేనడిగిన ప్రశ్నమునకుత్తరము చెప్పకపోయితిరి ?

దశ—ఉపశ్రుతియే చెప్పినది.

గీ, నీదు నునుతొమ్మ తలగడ ♦ మీఁదఁదలయు
నాదు నెదపైనఁ గాళ్ళుంచి ♦ నీదు సుతుఁడు
పండి యెడనెడఁగుయికు యుం ♦ చుండఁ గలసి
యతని జోకొట్టుచును సుఖ ♦ మందగలము.

అంతకంటె మనకిఁకఁ గావలసిన దేమి ?

కౌ—అంతవారమగునెడల నీకఁ గావలసిన దేమి? నాకుఁ గొంచెము కష్టముగనున్నది. నేనింకఁ బోవుదును. (పోఁబోవుచు) వైకుంఠవాసా ! నాహృదయమునయుండుము. గురు వసిష్ఠ భగవానుఁడా ! నమస్కారము.

(కన్నులనీరు పెట్టుకొని) ప్రాణనాథా ! నమ—స్కా—

దశ—ప్రాణకాంతా ! వలదు. నీవు నమస్కరింపఁదగదు. నేనే నీకు నమస్కరింతును. (తనలో)

గీ. కష్టములకోర్చి సృష్టికిజం ♦ కక యపార
సర్వసృష్టి మహాతంత్ర ♦ సారసరణి
చిన్నతన బొజ్జని ముదుచు ♦ కొన్నగర్భ
వతియె ప్రత్యక్షపరము దై ♦ వంబుగాదె?

శ్రీ శేషశయన పరబ్రహ్మణే నమః (నమస్కరించును.)

కౌ—(మోమెత్తి తేరిపాఱఁ జూచును.)

దశ—సతీ! అట్లు నిశ్చలముగఁ జూచెదవేల?

(తనలో) గీ. కసరినను దండ్రిపడినను ♦ గైకయాజ్ఞ
భీతిమన్నించి తనమాట ♦ వినకయుండి
నను జలువచూపు వలపుల ♦ నవ్వుపూలఁ
జల్లు నీమె జ్వాలలవెదఁ ♦ జల్లునేల?

(చేయిఁ బట్టుకొని) కౌసల్యా! మాటలాడవేమి? ఇట్లు రోజెదవేల!

కౌ—(దశరథునిఁ ద్రోసివయిచి) ధనుస్సు! ఏదీ ధనుస్సు— హా! హా! హా!

(చేయి విదల్చుకొని అట్టహాసముచేయును)

దశ—హాహాహా! ఇది యేమి?

గీ. మోవికెంపుల దాటిపైఁ ♦ బోనిచిన్న
మొలకనవ్వుల నను, కత్తి ♦ గొలుకులెడలి
పోని చూపుల ముగ్ధని ♦ ప్పాలను గురిసి
యట్టహాసముసేయు, వీ ♦ రాగ్రణివలె,

గీ. అంగుళుల యుంగరములె బ ♦ ర్వాచునోలుమ
నబల, యిల్లాలు, చూలింత ♦ ఱాలు, నన్ను
భీకరాసురహారుని ను ♦ ద్వృత్తుగాఁగ
గోటికొన విఱిచె నిదియేటి ♦ పాటవంబొ!

గీ. వీణయో! కేళికాబ్జమో? ♦ ప్రాణనాథు
పాదయుగ్మకమో! చిత్ర ♦ ఫలకమొక్క
యాఁడుదానికి ధనుసేల! ♦ యక్కటకట!
ఇంతికింతలో మతి చలి ♦ యింపఁగలదె?

ఇదిసమాసన్నప్రసవసూచకముగు తొట్రుపాటుకాదు. ఏదయినభూత మావేశించి యుండవలయును, లేదా పెద్దలో పేరటాండ్రో మ్రొక్కుకొందును. ఏవయిన మీఁదుఁ గట్టవలసినయెడలఁగట్టుకొందును. శిశువున కెవరిపేరు పెట్టుకొనుమన్న వారిపేరు పెట్టుకొందును. ఓకులదేవతలారా! ఓపితృదేవతలారా! మీయారాధనమున నేమయిన కొఱఁతగావించియుండినయెడల నన్నుక్షమింపుఁడు మీకోరికలేవో దయచేసి స్వప్నరూపమున వెల్లడింపుఁడు. అంతేకాని

గీ. అనువదగువేళయే యిలు ♦ మొఖఁడుగాఁగ
నున్నకట్టె మాంధవృక్షపుఁ ♦ జిన్నిచిగురు
పెట్టనున్నది, తతదయా ♦ వృష్టిఁగురిసి
పెంచుకొనుఁడు, మీయదిమీరు ♦ పెనుకఁడగునె !

(ప్రకాశముగా) కౌసల్యా ! (దరిఁజేరఁబోయి) ఆహా ! తిరుగఁ ద్రోచి వచ్చిన నెక్కడఁ బడిపోవునో ?

గీ. అసురరణ రంగములను శా ♦ కారి వెన్నొ
సంగుపట్టుల ప్రబలరి ♦ ష్టః పిశాచ
ఖండనోద్దండతాభి ము ♦ ఖ్యాంబుగాంచు
నేను సతిఁ జూడఁ జాల మో ♦ మెత్తి యహాహా !

ఆహా ! నాసతియేమి దివ్యదర్శనమిచ్చుచున్నది !

గీ పరమగుచు, నగాధమగుచు ♦ ప్రవిమలంబు
నగుచు, దుర్నిరీక్ష్యమగుచు ♦ నమితమగుచు
వర్ణనాతీతమగుచు దు ♦ ర్భరమునగుచు,
నొకమహాతేజమంటఁ గ్రాలు ♦ చున్నదహహా !

కావేరీ ! కావేరీ !

(నేపథ్యమున) బాబూ !

దశ—వసిష్ఠ భగవానుని శీఘ్రముగ దయ సేయుఁడని చెప్పి వెంటఁబెట్టుకొనిరా! వెళ్ళితివా ?

(నేపథ్యమున) ఆ!

దశ—నాకు మతిలేదు. చైతన్యమే లేనట్లున్నది. వైకుంఠ నిలయా! పన్నగశయనా! నాతండ్రీ! ఏమియీమాయ! ఏమియుఁ దోచకున్నది. ఎవరిదోకాలిచప్పుడగుచున్నది. గురువులవారువిచ్చేయు చున్నారుకాఁబోలు. (కొంచె మెదురుగఁబోయి) మహాత్మా! దయ సేయుఁడు.

[వశిష్ఠుఁడు ప్రవేశించును.]

దశ—మహానుభావా! నమస్కారము. మహాసముద్రమున బడియున్నాను. కౌసల్యవంకఁజూడుఁడు. అదేమి ?

వసి—(నవ్వుచు) మహాసముద్రమున నీవుబడియుండుటకాదు. మహాసముద్రమునఁ బడియున్నయాతఁడు మనయింటికింకవిచ్చేయును. ఈదినమేసుదినము నీబ్రదుకంతయునిందుకొఱకే! నాజప మంతయు నిందుకొఱకే!

దశ—మహాత్మా! కౌసల్యకేమియు నాపత్తులేదుకదా ?

వసి—(నవ్వుచు) దేవతలయాపత్తులింక నణఁగిపోవును ఋషుల యాపత్తులింకదీఱును, లోకములయాపదలు మాయమగును.

కౌ—(పీఠముతుంచి దుమికి) రే! సకలసురనికరసుఖరమా సమారంభ విమర్దనా! రే! సకలపవిత్రమహర్షిజాల జపతపోభంగ సమాచరణ సాహితీసనాథా! సాధుసాధ్వీయూథ బాధాచరణ విదగ్ధా! సత్యదయాశౌచ ధర్మశూన్యా! మహామాయావీ! రే! లోకకంటకా! రాక్షసాపశదా! కుంభకర్ణాగ్రజా! రావణాధమా! కాదికో! నీమరణమింక నిశ్చయము! పుత్త్రపౌత్రికళత్రబంధుమిత్ర

పరివారసహితముగ నీచావు సమీపించినది. ధనుస్సేదీ! తమ్ముఁడా! ధనుస్సు—

వసి—సెబాస్! వినఁదగినమాటలువినఁబడినవి. ఈకర్ణములు పవిత్రములయినవి.

దశ—మహర్షి చంద్రమా! ఇదియేమిటి? అయ్యయో! ఆ పీఠము పైనుండి క్రిందకు దుమికెను. గర్భమేమగునో? గుండెలదటి పోవునట్టి మాటలేమిటి?

వసి—రాజచంద్రమా! ఏమియుఁ జడియకుము. ఒక గడియలో నింక భగవంతుఁ డవతరింపఁగలఁడు. ఆతనిముందు చర్యయే యిప్పుడు వెల్లడింపఁబడినది. అదృష్టవంతులలో నగ్రగణ్యుఁడవునీవే! నింద్యమగు పురోహితవృత్తి నవలంబించి నీయింటనింతకాలమునుండి పడికాపులుపడుచు నేనుండుట యీమహాసుదినముకొఱకే.

దశ—తానేయింపఁ బుట్టలేదుకదా! తమ్ముఁడా! ధనుస్సేదీ యనుచున్నాఁడేమి? రావణు నీతఁడు వధియించునా?

కౌ—(పండ్లుకొఱుకుచు, గట్టిగ) వధియింపక—ఇంకను పేడయా! ధనుస్సు. ధనుస్సు. హా! హా! హా!

(విఱుచుకొని క్రిందఁబడును.)

దశ—అయ్యో! అయ్యో! (కౌసల్యనుబట్టుకొని) కౌసల్యా! కౌసల్యా! మహర్షి చంద్రమా! ఇదియేమి?

వసి—మరేమియు జడువకుము. గర్భముననున్న మహాతేజ మూమె భరియింపలేక పోవుటచేనట్లయినది. తొందరలేదు.

దశ—కౌసల్యా! కౌసల్యా! ఇంకనుస్మృతిరాలేదు. గురూత్తమా! ఏమిగతి?

వసి—నాకమండలూదకము నీమెపై కొంతచల్లెదను. (అట్లు చేసి) కౌసల్యా !

(కౌసల్య లేచును.)

(కౌసల్య అటునిటు తొట్రుపాటుతోఁజూచి)

దశ—ప్రాణకాంతా! నీకిపుడెట్లున్నది? ఇదిగో అటుచూడుము. వారెవ్వరు ?

కౌస—గురూత్తమా! నమస్కారము. నాథా! అట్లుడిగెద రేమి ?

వసి—(అపవారించి) రాజోత్తమా! ఆమెకిప్పటివృత్తాంతము తెలియనీయకపోవుటమంచిది. వెంటనే సూతికాగృహమున కామెను బంపుము.

దశ—కావేరీ !

(నేపథ్యమున) బాబూ ! వచ్చుచున్నాను.

వసి—రాజా ! నీవుకూడ లోనికిఁబోయి తద్గృహసమీపమున నుండి శీఘ్రోదయమగు వెంటనే యొకగంట వాయింపఁబంపుము. నే నిచ్చటనేయుందును.

దశ—తామొక్కరే యిక్కడ దయచేసియుందురా ?

వసి—నాశిష్యునిరమ్మని చెప్పి వచ్చితిని.

దశ—కావేరీ! ఇంకరావేమి ?

(నేపథ్యమున) అరుంధతమ్మగారువచ్చినారు. ఆమెకుఁ బూజా మందిరములోనికిఁ దారిచూపుచున్నాను.

దశ—సంతోషమే ! నీవిక్కడకు రానక్కఱలేదు. నేను గౌసల్యనటకుఁ దీసికొని వచ్చెదను. మహానుభావా ! సెలవా ?

వసి—మంచిది.

దశ—(కౌసల్యనుబట్టుకొని) దేవీ ! నీగర్భమున కెక్కడను దెబ్బతగిలినట్లులేదుకద. అంతయు సరిగనున్నదికద ?

కౌస—(అపవారించి)ఏమియు లేదు. ప్రాణప్రియా ! నీకుమహా తేజస్సంపన్నుఁడగు పుత్త్రుఁడు కలుగునని గురువుగారుమంగళాశాసన మొనర్చిరిసుమా !

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

వసి—రెండుయామముల వేళకావచ్చినది.

గీ. తనకులంబునఁ దనకంటె ♦ ఘనసమగ్ర
విమల తేజోవిరాజిత ♦ విగ్రహంబు
పుట్టివంశంబునకు వన్నెఁ ♦ బెట్టుననుచుఁ
బట్టబంధుఁడు నడునింగిఁ ♦ బ్రబలియుండు.

శిష్యుఁడు—(ప్రవేశించి) ఇదుగో శిష్యుఁడు, గురువుగారు నా కొఱకుపైకిఁ జూచుచున్నా రేమి ?

వసి—ఓరీ, శాంతా ! నీవు వచ్చితివేల ? వాఁడేఁడీ ?

శిష్య—నేను మాత్రము శిష్యుఁడనుగానా ?

వసి—నరే. కూరుచుండుము. ఈదిన మేతిథియో యెఱుఁగుదువా ?

శిష్య—ఏదయిన గొంచెమాధారమున్నగాని చెప్పలేను.

వసి—ఏయాధారము ?

శిష్య—ఈసంవత్సరము పంచాంగముచేయుటకుఁ గ్రిందటి సంవత్సరపుఁ గణితముకొంత యావశ్యక మగునట్లీనాఁటితిథి తెలిసి కొనుటకు నిన్నటితిథి తెలియుటఁ గొంతయావశ్యకము.

వసి—నీకింకఁ జదువురాదు. నీకు నావలన నేమియు నుపయోగించునట్లుతోఁచదు.

శిష్య—ఆసంగతినేనెఱుఁగకపోలేదు.

వసి—అటులయిన మఱియెక్కడకయినఁ బొమ్ము.

శిష్య—అన్ని స్థలములు చూడనిదే యిక్కడకు రాలేదండి. నాపూర్వగురువులందఱు తమరుగట్టివారనిచెప్పిరి. నాదురదృష్టమున నన్యథాయయ్యెను. నేనునింకఁ జదువుమానివైచి తపమో,కవిత్వమో మొదలు పెట్టవలయుననియేచూచుచున్నాను. కాని యీమహారాజుగారి పుత్త్రోత్సవాదులలో నేమయినలాభించునేమోయనియాసబెట్టుకొనియున్నాను. రాజభార్యలకుఁదొమ్మిదిదాఁటినది. పదిపదునొకండు దాఁటినది. పండ్రెండవమాసము నడుచుచున్నదని తెలియుచున్నది. మూడు తొమ్మిదులు కాఁబోలును. అందుచే నింతట దేలునట్లు తోఁచదు.

వసి—అక్కర లేదు. కౌసల్యాదేవి గర్భమున మహాతేజశ్శాలియగు పుత్త్రుఁడిఁకపావుగడియలోజన్మింపనైయున్నాఁడు. శుద్ధనవమి. పునర్వసూనక్షత్రము. అన్నియుబాగుగనున్నవి.

శిష్య—నవమినిఁగూర్చి నాకుఁ గొంచెము సందేహముగ నున్నది.

వసి—ఎందుచేత ?

శిష్య—జన్మమనఁగా నీటిలోఁ బ్రవేశముకాదా? ప్రవేశ నవమి నిషేధముగదా?

వసి—నీమొగము! ఆమహాతేజ మిదివఱకే దేవీగర్భమునఁ బ్రవేశించినది. ఇప్పుడు ప్రత్యక్షమగుటయే జరుగనైయున్నది.

శిష్య—ప్రత్యక్షనవమిమాత్రము నిషేధముకాదా ?

(లోనగంటవినఁబడుచున్నది.)

శిష్య—అద్దీ ! సత్యము, నేను జెప్పినమాట సత్యము.

వసి—ఆగంట నీకుపశుత్రి కాదు. అది శీర్షోదయముగువెంటనే వాయించినగంట. దీనినిఁబట్టి తరువాత జాతకచక్రము వేయుదును.

శిష్య—శీర్షోదయసమయము మనకుఁ బ్రధానము కాదు. మూఁడు దినములక్రింద శీర్షోదయము కాలేదు. అదిమనకు లెక్క కాదు. భూపతన సమయమే ముఖ్యము.

(నేపథ్యమున) ఫిరంగులధ్వనియు ఢంకాభేరీవాద్యములధ్వనులు వినఁబడును )

వస—ఆహా ! మంగళవాద్యములు వినఁబడుచున్నవి. భగవానుఁడవతరించినాఁడు. లోకమునకెట్టి శుభదినము సిద్ధించినది ?

గీ. చైత్రమందునశుద్ధ ప ♦ క్షమునవమి
తిథిఁ బునర్వసూ తారను ♦ విధుగురుయుత
గర్కటక శుభోదర్క ల ♦ గ్నమునను బుధ
వారమునను శ్రీహరి యవ ♦ తారమందె.

(నేపథ్యమున) జనులారా ! సందడిసేయవలదు. మీకందఱకు సంతుష్టికరముగఁ బంచిపెట్టించెదను.

శిష్య—సుమంత్రుఁడు సేవకులచే ఖండశర్కరజనులకుఁబంచి పెట్టించుచున్నాఁడు. నేనుగూడఁ బోయి తెచ్చికొందునా ?

వసి—పో—

శిష్య—(పోవును )

(నేపథ్యమున) సుమంత్రుఁడా ! యథేష్టముగ నిష్కములఁ

బందిపెట్టింపుము.

వసి—రాజేంద్రుఁడవునో! యిటకు వచ్చుచున్నాఁడు.

దశ—(ప్రవేశించి) నమస్కారము.

గీ. అంధునకు నేత్రసంపత్తి • యమరెఁ బుల్ల
విఱిగి మోడైన చెట్టు పు • ష్పించెఁ గడుప్రఁ
కటవగు దరిద్రునకు • రత్నఖనిలభించె
దాసునకుదొడ్డగతిగల్గె • దాపసేంద్ర.

వసి—దాసునకేగాదు దేశమునకింతకని చెప్పుము.

దశ—బాలుఁడు బహుతేజస్వియైయున్నాఁడఁట.

వసి—నీవింకఁ జూడ లేదా!

దశ—నాకు దైవసములగు మీరుచూడకుండ నేజూచెదనా? వత్సకు శుభస్నానమయినది. నేను గూడస్నానమొనర్చి పరిశుద్ధుఁడ నయియున్నాను.

వసి—జాతకర్మాది కృత్యములింక నిర్వర్తింపవలసి యున్నవి.

దశ—కావేరీ! బాలునిట్లు తీసికొనిరమ్ము మహర్షిసత్తము లకుఁ జూపింతును.

(కావేరి పొత్తులలోనుంచి వత్సను దెచ్చును)

దశ—పిల్లవానిని ముందు గురువుగారికిఁ గానఁబఱుపుము.

వసి—రాజేంద్రా! నీవుకూడ జూడుము.

దశ—(చూచుచు) ఎట్టులున్నాఁడు?

వసి—ఇదికన్ను. ఇదిముక్కు. ఇది చెవియని నాకేమియువిస్పష్ట ముగఁ గానఁబడుట లేదు.

గీ. కనులు మిఱుమిట్లుగొల్పి పు ♦ ల్కలనొసఁగి
మోదబాష్పములను వెల్వ ♦ పూర్ణవిమల
శాంతగంభీరతేజంబు ♦ స్వల్పపూర్వ
పరిచయముగల యదియెమె చూ ♦ పట్టెనాకు.

దశ—గురువర్యా! అది యేమి? ఇంతపిల్లవాఁడు విస్పష్టముగఁ గానరాఁడనుచున్నా నేమి?

ఆ. వె. అరగమూయునపుడె ♦ యంతంత లోకనుల్
విప్పినప్పుడెంత ♦ గొప్పలగునొ?
మాట గాఁగ బాడు ♦ బుఱుతఁజింతగనుండ
సాగియుండ నెంత ♦ సోగయునొ?

గీ. మెఱుగుఁ జామనచాయల ♦ బొంగరఁగుతోడ
డంబుమీఱెడు గుండ్రగ ♦ ష్ఠంబుతోడ
ముద్దులనుమాట గట్టునె ♦ మొగ్గముతోడ
నితఁడు నయనాభిరాముఁడై ; ♦ యొసఁగునాకు.

గురువర్యా! ఈతనికేమి పేరు పెట్టినబాగుగనుండునో తెల్పెదరా?

వసి—నీవు సూచించుచునేయుంటివికాదా? ఈతఁడు సర్వజన నయనాభిరాముఁడు. కావున రాముఁడని పేరు పెట్టుము.

దశ—తగినపేరు సెలవిచ్చితిరి.

వసి—ఈతఁడు ముందుచేయు లోకోపకారక కృత్యములను బట్టి యాపేరింతకింకుఁ దగియుండఁదలఁచియున్నది.

దశ—అంతయు దమ యనుగ్రహము. సుమిత్రయుఁ గైకయు బాలునిఁజూచిరా?

కావే—సుమిత్రమ్మగారు చూచినారు. కైకమ్మగారుచూడ లేదు.

దశ—ఎందుచేత ?

కావే—ఆమె బద్ధకముగో నున్నారు.

వసి—రేపటిదినమున నీసరికి రెండవపుత్త్రినెత్తికొనియుందువు జాతకర్మము లాలసింపఁదగదు. లోనికి మీరు పొండు. నేను స్నాన మొనర్చివచ్చెదను.

దశ—చిత్తము !

(అందఱు నిష్క్రమింతురు)





శ్రీ

# కల్యాణరాఘవము.

## తృతీయాంకము.

ప్రదేశము—సరయూనదీగోష్ఠం.

ప్రవేశము—విశ్వామిత్ర శిష్యుఁడు నారాయణుఁడు; వసిష్ఠ శిష్యుఁడగు శంకరుఁడు.

శంక—నారాయణుఁడా! మనముగలసియెంతకాలమైనదో?

నారా—శంకరా! శ్రీరామ జన్మోత్సవములకు మహారాజా హూతులగుమావిశ్వామిత్రగురువుగారితో నేనిటకువచ్చినప్పుడునిన్నుఁ గలసితిని.

శంక—ఎన్ని వత్సరములైనదో — ఇరువది వత్సరములై యుండునా?

నారా—అజ్ఞే! పదుమూఁడువెడలి పదునాలుగు జరుగు చున్నదో—పదునాలుగు వెడలి పదునయిదు జరుగుచున్నదో?

శంక—ఇంతే—కాలము నాచదువువలె నింత మెల్లఁగ నడచు చున్నదే.

మాగురువుగారికి విద్యాభ్యాసనార్థమై రాజుగారొప్పగించిరి. అప్పటికి నేనొక యగ్రహారమునుండి జందెముపడితివైదిక రుప్పలు వేయుచున్నాను. వారు నాక్రింది తరగతిలో నొకవారముండిరి. తరువాత నొకమధ్యాహ్నము సహపాఠకులుగనుండిరి ఇప్పుడు నాకు గురువులుగ నుండిరి. వారికి నాలుగు వేదములు వచ్చినవి. ధనుర్వేదము వచ్చినది. ఉపనిషద్విద్య వచ్చినది. వేయేల ? అఱువదినాలుగువిద్యలును వచ్చినవి.

నా రా—నీకేమి వచ్చినవి?

శంక—నెత్తికిఁ జేతులు—కంటికి నీళ్ళు—ఒడలికిఁ జేవబెత్తపుఁ దట్టులు.

నా రా—రాకపోయినప్పుడింత కాలము కష్టపడి చదువనేల?

శంక—వచ్చుచున్నది కావున నే చదువుచుంటిని.

నా రా—వచ్చుచున్న దేమి?

శంక—కోటలో సంభావన—ఊరిలో దొడ్డిదక్షిణ.

నా రా—"నీకుఁ జదువు రాదు—నీవు పో" యని గురువుగారు చెప్పుడు నిన్నన లేదా?

శంక—అనేక పర్యాయములు.

నా రా—అట్లయిన నాయన నిన్నేల వదలుకొన లేదు?

శంక—పిల్లలను కొట్టుటలోను వీఁపు గోకుటలోను విశేషవిద్వాంసుఁడగుటచే విడువలేకుండ నున్నారు గాఁబోలు. కాని యిప్పుడేమియు నుత్సవములు లేవుకదా! మీగురువుగారేల వచ్చిరి?

నా రా—అది నాకెట్లు తెలియఁగలదు?

శంక—పోనీ—నీవిట్లు నీధ వెంట నేల తిరుగుచున్నావో యది యైనఁ దెలియునా?

కన్నులు తెఱువును. (వింటిలోఁ గంటిపైఁ బొడుచును.)

తాట—(కన్నులు తెఱచి) ఎవఁడురా! కంటిలోఁ బొడిచినాఁడు.

లక్ష్మ—నేను,

తాట—(ఆవులించుచు లేచి) నీ వెవఁడవు ?

లక్ష్మ—ఈతని సోదరుఁడను.

తాట—(రామునివయిపు తిరిగి) నీ వెవఁడవు ?

రామ—ఈ మహానుభావునివలన మహాస్త్రవిద్య నేర్చిన శిష్యుఁడను.

విశ్వా—తాటకా! నేనీ నారాయణుని గురుఁడను. నీకుఁ గృతపరిచయుఁడను.

నా. రా—అమ్మయ్యో! నాపేరు చెప్పితి రేల? నేనిట నుండజాలను.

(పారిపోవును.)

తాట—ఓమునిముచ్చా! ఋషిపక్షీ! నీవా? మూర్ఖాంకారమునకాఁగ లేక, యీనడుమ బుంజాలు తెగ్గింపుకొని కాలికొలఁది పారిపోయితివని వినియుంటిమే! తిరుగ గుద్దులగూబ మొగమున సందెజామున మాసన్నిధికి సిద్ధపడితివా? అట్లు చూచెద వేమి? గుడ్లు పీఁకెదను చూడు! (మీఁదికిఁ బోవును.)

రామ—(ఆమె కడ్డముగఁ బోయి) గురూత్తమా! లక్ష్మణా! మీరావృక్షముక్రింద విశ్రమింపుఁడు.

విశ్వా—(దూరముగఁ బోయి) (అపహాసించి) ఒకపాపుగడియ వటుకుఁ జంపకుము. ఇంక వేళ కాలేదు.

రామ—తాటకా! మహాత్ములదూషించుట తప్పుకాదా?

తాట—నీవేల యడ్డువచ్చెదవు? ఓసరిల్లు! ఊఁ—పో—పో!

మీఁదఁ బడు నెడల నలిగిచచ్చెదవు. జేనేఁడు లేవు. కొంకెబద్దచేత సింగారించి కొండెపిగతో సిద్ధపడితివి. ఈవింటిపుల్లతో నాయొడలి మీఁది యీఁగలను గొట్టఁదలఁచితివా? తలలోని పేలనుమట్టుమాపఁ దలఁచితివా?

రామ — ఛీ! ఛీ! నీప్రాణముల నేహరింపవచ్చితిని.

తాట — అబ్బ! అబ్బ! ప్రాణములనుహరింతువటే! నాపాలు ద్రాఁగి యరగించుకొనఁగలవా? వామనా! డబ్బెత్తుగా! గోఁగు పుల్లకుఁదాఁకి చెట్టుతో గుటగుటలా? దోమకుఁ దోఁడేలుపై దండయాత్రయా? ఈముసలిముని ముండకొడుకు నిన్నిక్కడకుఁ దెచ్చినాఁడా? ఓస్! సీతతో నింకొక శొంఠికాయగాఁడున్నాఁడా? గొల్లభామలతోడను, ఇల్లిల్లులతోడను నాడుకోవలసిన కుర్రలు పెద్దపులి కోరలనడుమ వ్రేళ్ళుపెట్టవచ్చితిరా? సీతాకోకచిలుకలప్రక్క లెక్కలాగువారు సింహపుజూలున వ్రేలాడఁదలఁచితిరా? నీకు మతిలేకున్న నిన్నుదెచ్చిన యాసన్యాసికి మతిలేదా? నిన్నుఁబంపిన యాసంసారికి మతిలేదా?

రాము — వారికి మతిలేక పోలేదు. నీకుమతిలేక — బ్రతుకగతి లేక — యిట్టికాఱులఱచుచున్నావు. నీమరణకాల మాసన్నమయినది. ఇఁక దాదాపుగ నాలుగునిముసములకంటె నెక్కువజీవింపవు. ఈ యత్యంతస్వల్పకాలమును వ్యర్థమొనరింపక పూర్వ మహాఘోరపాప కృత్యములకై నిశ్చలపశ్చాత్తాపముంది పరమేశ్వర లగ్ననేత్రచిత్తవై ప్రాణములు విడుచుట నీకు శ్రేయస్కరము.

విశ్వా — (తనలో) జరుగునదంతే.

లక్ష్మ — (తనలో) వేగోలమునకు వేదాంతోపదేశమేల?

తాట — ఆఁ! ఆఁ! చిట్టెలుకకు సింహగర్జనమా? ఊర

కుండుకోలఁది నోరెక్కువగుచున్నది. ఎట్లు ? ఎట్లు? మేము చేసినవి ఘోరపాపకృత్యములా ? హోమకుండముల రక్తవర్షములు కురిపించుట పాపమా? యజ్ఞశాలలకు నిప్పంటించుట పాపమా? మునికాంతలను దలక్రిందుగఁ జెట్లకు వ్రేలాడఁగట్టుట పాపమా ? వారి పిల్లలను యజ్ఞశాలాజ్య పాత్రముల దొరగవేయించి కమ్మఁగఁ గరకరలాడు చిండఁ దినుట పాపమా ? ఎవరికిఁ బాపము! దానివలన బాధనొందు వారి కదిపాపము—మా కేమి? సంతోషమిచ్చునది పుణ్యము—బాధ నిచ్చునది పాపము—ఇదియే మా పుణ్యపాపవివక్ష. కాని, ప్రపంచ జ్ఞానశూన్యుఁడై—దయాదాక్షిణ్యశూన్యుఁడై—నిరుపయోగవైదిక కర్మతంత్రుఁడైన యీ ముని వెంటవచ్చి నీతనువును పవిత్రముగఁ జేసికొని ప్రబల పాపము గట్టుకొనుటేల? చిన్నవాఁడవు—ఇంకఁ గొన్ని యేండ్లు దాఁటినపిమ్మటఁ బొట్టపోసికొనఁ గలవాఁడవగుదువు నామనుమ రాలిని—నీకొసఁగెదఁ బైపెంక నొక పిడికెఁడుమాత్రము పొడవు గల ముద్దులాఁడిని గట్టుకొనరాదా? దాని వెంటఁబెట్టుకొని ముక్కు-కొనవఱకుఁ ద్రావి యమామార రాత్రులందు శ్మశానములఁ జేరి క్షోణీకుక్షివినిక్షిప్త శవములనుదిని, పుర్రెల బంతులాడుకొనుచుఁ బ్రేవు మాలలుధరించి దిగంబరులై తాండవించుచుఁ గ్రీడించి సుఖమొంద రాదా? గర్భవతులగు మునికాంతలను బట్టి—

రాము—ఇఁక నోరుమూసికొనుము. ఇదిగో! నిన్నుఁ జంపె దను. కాచికొనుము.

తాట—చంపుదును, చంపుదునని యింత తెగసాగెదవేమి? హేం! హేం! హేం! ఏదీ! చంపు! చంపుటయా బద్ధతోడ నేనా? ఈ బద్ధనా తలగొట్టుకొనుటకుఁ గానుకాని, పండ్లుకుట్టుటకు బనికివచ్చును. ఇటు తెమ్ము. (లాగుకొనఁబోయి విల్లుపట్టుకొనును.)

రాము—సరే! లాగుకో!

తాట — రాదేమి ?

రామ — రాకపోవునెడల చేతులువదలుము.

తాట — నీచేతినుండి సిపాణములతోఁగూడ నిడలాగుకొన లేనా? ఊఁ! ఊఁ! అబ్బ? ఊఁ! రాదేమి! ఏమిది! సాంవృక్షములనవలీలగఁ బెకలించిన నేను—శైలములను బిండికిందఁ బడదన్నిన నేను—ఊఁ! ఊఁ! అబ్బ! రాదే! ఏనాంతుకఁగోయ! నామోహాకారమంతి పొడవుంటివో లేదో—నాతోడఁ జరపిన నీవంటివాండ్రెగ అనుదూరో! ఊఁ! ఊఁ! అబ్బ! రాదే! లాడితేఁనంటివో లేదో—విల్లంతాగట్టిగఁ బట్టుకొంటివి! ఓరీ! జలగా! ఓరి! ముదుఁగునూకివాఁడా! ఊఁ! అయ్యో? రాదేమి ? పోనీ! విల్లులాగుకొనలేకపోయినపోనీ! నిన్ను నాదౌడ నీదౌడ వాయించలేకపోదునా ? నిన్నెత్తి నెత్తిమీఁద నొకచేయి. కాళ్ళకిందనొక చేయిబెట్టి—చితుక్కున నప్పళించి యరచేతులతో రసముతీసిపిప్పి నటుపారవేయలేకుందునా ? నిన్ను రెండుకాళ్ళుపట్టి నిలువునఁ జీల్చి పూడిపోవుచున్న యీచెవి రంధ్రములలోఁ బెట్టలేక పోవుదునా? పో! నీవిల్లెవకెకుఁ గావలయును? ఇదిగో గుద్దిపొడిచేసి రక్తముతోఁ బగనుచేసి మామనుమరాలికాలికి లత్తుకకై యుపయోగింతును. పో! (విల్లువదలి నైచుటకుఁ బ్రయత్నించును.) ఆఁ! ఆఁ! ఇదేమి! విల్లువదలెగనన్నఁ జేతులువదలిరావే! ఊఁ! ఊఁ! అయ్యో! అయ్యో! ఇదేమి? హా! హా! హా! (అఱచును,) ఊఁ! ఊఁ! (లాగుకొనును.)

రాము — తాటకా! నీచేతులఁగూడఁదీసికొనఁజాలవు. నావెంటనిమ్మళముగ రమ్ము.

(రాముఁడు పరిక్రమింపఁగఁ దాటకకూడవచ్చును.)

విశ్వా — (తనలో) సెబాస్! రామచంద్రా!

లక్ష్మ—(తనలో) ఆహాహా! అదేమి? దేహబలమా? యోగబలమా? అస్త్రబలమా? ఏమియు బోధపడకున్నది.

గీ. మంత్రిగాని వెంట ♦ మహీధరమల్లు పి
శాచగురుని వెంట ♦ శాకినివలె
నసుర దమను వెంట ♦ నాసురి వచ్చిన
ట్లెటులు రమ్మనుచున్న ♦ నటులువచ్చు,

రామ—ఇటు ఇటు

తాట—"ఇటు ఇటు" అని గుర్తించుండకువలె గారిచూపింతువా? చేతులు స్వాధీనములేకున్నఁ గాళ్ళతో నెగిరితన్ని నిన్నుఁ బాత్రిక్షుద్రమునఁ బట్టైవలేనా? (ఎగురును) ఊఁ! ఊఁ! ఎగురుటకేగాని తన్నుటకుఁగాళ్ళు లేవకున్నవేమి? ఆకస్మికముగ నేదయిన వాతరోగము వచ్చినదా? రోగము వచ్చినయెడలమాత్రమీ నరమృగము నన్నెమింగ లేకుందునా? ఆఁ! ఆఁ! (నోరు తెఱచి) అల్లనేరేడుపండునువలె మింగెదను. గుటుక్కున మింగెదను. ఆ! ఆ! నీతలయంత దూరముగఁ బెట్టుకొనెదవేమి?

లక్ష్మ—(తనలో) చండాలినీ! కొఱుకుమని తల కోఱల సందునఁ బెట్టుమంటివా?

రామ—నేను దల వెనుకకుఁ దీసికొనుటకాదు. నీతల ముందునకు సాగుటలేదు

తాట—తలకూడవంగదా? ఊఁ! ఊఁ! హా! హా! హా! (నోరు తెఱచును) కొంచెము వంగుచునే యున్నదికాని నీతల తీసికొనిపోయి యీమూల పెట్టుకొన్న నేనెట్లు కొఱుకఁగలను?

రామ—నెత్తియోనలు పెట్టుకొనకుము. నాతల నీపండ్లనడు

మనునే బెట్టినను నీవు కోలుకఁజాలవు. కాని నిన్నట్లు ప్రత్యక్షముగ స్పృశింపనొల్లను కూడదు రమ్ము. ఇటు. ఇటు.

తాట—నన్నా మునియొద్ద కేలకొనిపోయెదవు ?

రామ—ఆతఁడే నీకుత్తమగతిప్రదాత. ఆమహానుభావునికిఁ దలవంచి నమస్కృతినిఁ దెల్పుము. ఊఁ!

తాట—నాకీ బలాత్కార ప్రణామప్రారబ్ధమేల ?

రామ—ఆమహానుభావుఁడు నిన్నుక్షమించు నెడల నీకుఁగొంత పాపశాంతి కాఁగలదు.

తాట—నన్నుఁ జంపఁదలఁచిన వాఁడ వేదోరీతిగ శీఘ్రముగఁ జంపక యెందులకునన్నిట్లు బాధింతువు ?

రామ—తాటకా! చంపి పగఁ దీర్చుకొనుటయే నాపనియగు నెడల నీకును నాకు నేమియును భేదమున్నది ?

గీ. కొట్టినయతండు పగదీర్చు ♦ కొనినయంతఁ
డిద్దఱును రాజశిక్షార్హు ♦ లేయగుదురు
పరనరునిపై స్వతంత్రతఁ ♦ బగయుకతన
పుడమిపతి శాసనముతానె ♦ నడపుకతన.
పాపములనొప్పుకొని యెవ్వఁ ♦ పంచనంబు
స్వశిక్షను గనునను ♦ డచటమరల
శిక్షనొందఁడు గావున ♦ శిక్షఁజేయఁ
బ్రభువునానతి ముని వెంట ♦ వచ్చినాఁడ.

కావున దోషములను మన్నింపుమని యీమహాత్ముని వేఁడుకొనుము.

విశ్వా—(తనలో) సెబాస్! రామభద్రా!

లక్ష్మ—(విశ్వామిత్రునితో, నవారించి) మాయన్నగారెంత

మహానుభావులో! ఎంత కరుణామయులో!

తాట — మహాత్మా! గాధినందనా! ఒక్కనోరు తప్ప నేదియు స్వాధీనము లేదు. కాన, వాక్కులతోడనే నమస్కరించుచున్నాను క్షమింపుడు.

విశ్వా — నీవింక ధన్యాత్మురాలవయితివి.

రామ — తాటకా! నీవిట మృతినొందుటఁజూడఁ బూజ్యులగు మునీశ్వరులకు వెగటుగ నుండునుగాన నటు సిద్ధఝరీ తీరమున సుస్నాతవై పరలోకమునకుఁ బోవుదువుగాని రమ్ము.

(రాముఁడు తాటకయు నిష్క్రమింతురు)

లక్ష్మ — తాతగారూ! మాయన్నగారి చర్య విచిత్రముగ నున్నదండీ! ఇంతవారని నేనిదివఱకెఱుఁగియుండను. పనివచ్చినప్పుడే కాని మనుజుని గుణములగుపడునా?

(నేపథ్యమున రాముఁడు)

గీ. ఖలసుబాహు మారీచ రా ♦ క్షసులమాంత
యైన తాటక గాన్చెను ♦ తాబ్జభవుని
యూన పరలోకయూనయా ♦ కాననింక
ఋషులు నిర్విఘ్నయాగుల ♦ య్యెదరుగాక!

విశ్వా — తథాస్తు! (తనలో) ఇప్పుడుకూడ "మానియూన" యనియే యాతఁడు పలుకుచున్నాఁడు. కాంతను జంపుట తన యిష్టముచేఁ గాదని వెల్లడించుచున్నాఁడు.

లక్ష్మ — మండుచున్నవత్తిని జేయూఁపుచే నార్పినట్లు కాసంత శబ్దమైనఁ గాకుండ నెల్లుగా వధించినాఁడో!

(నేపథ్యమున) హాహాహా! ఎవఁడురా! అక్కడ? మాఅమ్మను

వధించినకతినాత్ముఁడు పట్టుకో! కొట్టు! పోకు! చంపు! తమ్ముఁడా! నీవిటురా! నేనటువత్తును. ఆఁగు! పోకు!

లక్ష్మ—ఆహా! యిద్దఱు రక్కసులు మా యన్నయ్యమీఁదఁ గదలఁబోవుచున్నారు. నేను సహాయుఁడనై పోవుదును. (లేచును.)

విశ్వా—వత్సా! కూరుచుండుము. రాక్షససంహారక మారకునకు నీసాహాయ్యమేమి? నాప్రోత్సాహమేమి?

లక్ష్మ—అదేమి? ఆ రాక్షసుఁడట్టె గాలిలోఁ గొట్టుకొని పోవుచున్నాఁడేమి?

విశ్వా—రామచంద్రుని వాయవ్యాస్త్ర వేగమున నాతఁడట్లు కొట్టుకొనిపోవుచున్నాఁడు.

రామ—(ప్రవేశించి) సుబాహుఁడా! దైవ ధ్యాన మొనర్చుకొనుచుఁ జావుము.

విశ్వా—సెబాస్! సుబాహుఁడు కూలినాఁడు.

లక్ష్మ—అన్నయ్యా! రమ్ము. (కౌఁగలించుకొనుచున్నాఁడు.)

రామ—గురూత్తమా! నమస్కారము. మారీచుఁడేఁడీ?

నారా—(ప్రవేశించి) ఇచ్చటనేయున్నాను, నాకు భయము చేఁబోలేదు. రాక్షసులు దగ్గఱకు వచ్చినయెడల మైల పడుదుమని కొంచెము దూరముగఁబోయితిని.

విశ్వా—నాయజ్ఞమున కింకేమియు భంగము జరుగనేరదు. నేను కృతార్థుఁడనైతిని.

రాము—కాని, మారీచుఁడు చావలేదు. ఆతఁడు ముందు నాపైఁ బగతీర్చుకొనుట నిస్సందేహము,

గీ. కష్టనిష్ఠుర భావిరా ♦ ఘవమునకును
  మిగిలె నతఁడు నాటక బీజ ♦ మగుటకొఱకు ;

సప్తద్వీపాంతరాళపప్రగంతు • లాడవచ్చు
నిప్పుడు ముందంకమేదో వి • న్పింపవలయు.

విశ్వా—ఇఁక ముందుచేయవలసినదేదనఁగ, నాయాశ్రమము నకుఁబోయి యచ్చట యజ్ఞమాచరించుకొని వెంటనే జనకభూపతి దేశమున కేఁగవలయును.

లక్ష్మ—మేము మహారాజకుమారులముగదా! ఆరాజు దేశమునకు మేమేల ?

రామ—తమ్ముఁడా! మహారాజ పుత్త్రులమైనను మునివరుని దాసులముకదా! వారిసందేశమునకు మాఱుకారణపృచ్ఛయేల?

విశ్వా—భూస్థలమంతయు రాక్షసపదవిన్యాసమును బాసినదై యున్నది. కొంచెము దూరముగఁబోయి యట శయనించి యరుణోదయమున బయలుదేఱి పోవుదము. రండు.

(అందఱు నిష్క్రమింతురు.)





శ్రీ

# కల్యాణరాఘవము.

## పంచమాంకము.

ప్రదేశము—మిథిలాపురము.

ప్రవేశము—జనకుఁడు, శతానందుఁడు, విశ్వామిత్రుఁడు రాముఁడు, లక్ష్మణుఁడు.

విశ్వా—జనకచక్రవర్తీ! ముమ్మాటికి నన నేల?

జన—ఒకమాఱుకాదు. రెండుమాఱులుకాదు. ముమ్మాటికి ధన్యుఁడ.

గీ. యతుల రాకచే ధన్యుఁడ; హితుని సుతులఁ
గనఁగఁ దిరుగ ధన్యుఁడ, మహోగ్రస్వభావ
తాటకాఘ్నుల కాతిథ్య ధర్మకలన
జరుపధన్యుఁడ; మూఁడవ పతినిమఱల.

లక్ష్మ—రాజేంద్రా! మీహితుని సుతులము మేమిద్దఱమగుదుము. తాటకాఘ్నులని మీరు చెప్పుచున్నారు. కాని తాటకాంత

కులము మేమిద్దఱముకాము. అసహాయశూరుఁడయిన మాయన్నగా రగు శ్రీరామచంద్రుఁడొక్కఁడే. కాన మీరు కొంచెము సవరించు కొని యన్వ్యముగ నాకుఁ బంచియిచ్చిన గౌరవమును మాయన్న గారి కొసఁగుఁడు.

రామ — (నవ్వుచు) తమ్ముఁడా ! బహువచనప్రయోగ మేల?

జన — వత్సా ! రామానుజా ! తాటకాఘ్నులని మీయన్న గారిని బహు వచనప్రయోగముచే గౌరవించితినని యనుకొనరాదా?

రామ — రాజేంద్రా ! మునిప్రభావమున జరిగిన పనికినన్నుఁ బెద్దసేయనేల ?

జన — సెబాస్ !

గీ. పండ్లఁబోలు పెను ఫిరంగి ♦ గుండ్లఁబోలు
వజ్రములఁబోలు భవ్య దీ ♦ పములఁబోలు
భువిని స్ఫటిక సాలగ్రామ ♦ మూలనుబోలు
సుతులఁగను దశరథు భాగ్య ♦ మహితరంబు.

విశ్వా — రాజేంద్రా ! ఈమాత్రమునకే యొకటి, రెండు, మూడు సారులు ధన్యుఁడనయితినని గణించుకొనుచున్నావా! నాలు గవసారి, మొదవసారికూడ ధన్యుఁడవు కాఁదలఁచియున్నావు.

జన — మహానుభావా ! అదెట్లు ? ముందునాలుగవసారిధన్యత యెట్టిదో సెలవిచ్చెదరా ?

రామ — (అపవారించి) గురూత్తమా , సంక్షేపముగఁ జెప్పుము.

విశ్వా — (తలరామునివంక నూఁపి) జనక రాజేంద్రా ! మీ పురోహితుఁడగు నీశతానందునకు జరిగిన మహోపకారము మీకుఁ

ఱరిగినట్లేకదా!

జన — ఇంకను సందేహమా? నాకు జరిగినకంటె నెక్కువ.

శతా — నాకట్టి యుపకారమేమి?

విశ్వా —

సీ. అసువుపోనున్న రోగిని • హస్తశుద్ధి
బ్రిదుకఁజే యునాతఁడె భగ • వంతుఁడనఁగఁ
జచ్చితాయిఁగూ దేహిని • జరణశుద్ధి
బ్రదుకఁ జేసిన యాతఁడే • పాటివాఁడొ!

జన — నాకేమియుఁ దెలియలేదు.

శతా — ఆఁ! ఆఁ! మునిచంద్రమా! నాకు గుండెలు కొట్టు
కొనుచున్నవి. మాతల్లిగారే! మాతల్లిగారే!

విశ్వా —

సీ. ఆకు రాలున నట్టి మో • డైన తీఁగె
మాఘపునిరాకఁ జిగిరించి • మనెడుకరణి
రమణుకోపంబుచే నైన • రాతిబొమ్మ
కుట్టురాముని దయముద్దు • గుమ్మయయ్యె.

శతా — ఆహా! రామచంద్రా! మాయమ్మగారిని బ్రిదికిం
చితివా? (రామునిఁగౌఁగలించుకొని) ఎంత మహోపకార మొన
ర్చితివి. వయసుచే నీకంటెఁ బెద్దవాఁడనుగావున నమస్కరింపలేదు.
క్షమింపుము.

రామ — మహాత్మా! మీరట్లు సెలవీయఁ దగునా? ఇందుకు

నేఁజేసిన మహాపుణ్యమేమున్నది ?

జన—ఆఁ! ఆఁ! మాయింటి కతిథివై దయచేసిన యాతఁ డహల్యాశాపవిమోచకుఁడా ? ఏమి నాధన్యత !

విశ్వా—నాలుగవసారి ధన్యత యేదో చెప్పితివా ?

జన—ఇఁక నైదవసారి దేమో దయచేసి చెప్పెదరా ?

విశ్వా—దాని యవసరమునఁ జెప్పెదను.

శతా—రామచంద్రా! ఇందున "నేమి పుణ్యము చేసితి" నని యనుటన్యాయమా!

గీ. కాంతను ద్యజించుకాంతునకుఁ ♦ గాంతఁజేర్పఁ
గలుగుపుణ్యంబె యింతంత ♦ గాదనంగఁ;
దల్లినెడఁ బాయుపుత్త్రిని ♦ దల్లిఁగూర్చు
పరమపుణ్యంబునకు భూమి ♦ పట్టఁగలదె ?
పితదయకుఁ బాత్రినపుటంటు ♦ వెలయుఁగొంత;
సుతునిదయకై హాకపుసొక్కు ♦ సుంతకలదు;
సతిదయకు మట్టిరంగు కా ♦ సంతయుండుఁ;
దల్లిదయశుద్ధ దివ్యత ♦ త్త్వంబొకండె.

రామ—

కనవుతోనున్న మణియూడ్చి ♦ విసరినైన
పిధినున్నాతనికది ల ♦ భింపవచ్చు;
దానిచే వాఁడు భాగ్యంబుఁ ♦ గానవచ్చు
నూడ్చుసేవకు పుణ్యమే ♦ మున్నదిందు ?
కలిసిబూడిద నున్న యం ♦ గారకణము

రథ్యలోఁ బొఱలివైవఁగఁ ♦ బ్రక్కఁ-తాటి
కమ్మఁగడికాలి యూరెంత ♦ గాలవచ్చు
నూడ్చువేవకు పాపమే ♦ మున్నదిందు ?
నిదురఁ దిట్టిన తిట్టులు ♦ నింద్యమగునె ?
నిదురదేవార్చనలు శుభా ♦ స్పదములగునె ?
మనసుతో లంకెలేని నా ♦ మాన్యకృతుల
పాపపుణ్యచింతన సేయ ♦ వలనుపడదు.
ఇట్లు నేనచ్చువేళ నా ♦ దృచ్ఛికముగ
నాపదరజంబు తాఁకిని ♦ నాతిఁజేసె
నేమియు నెఱుంగఁ దెల్లవో ♦ యి నిలఁబడితి
యిట్టినన్నుఁ బెద్దసేయుదు ♦ రేల మీరు.

శతా—ఇట్లువదియించుచున్న నీతో నేనేమనఁగలను ?

విశ్వా—(తనలో) స్తుతివాక్యములు వినుటచేఁ గాఁబోలు రాముని మొగ మెఱుపెక్కినది. (ప్రకాశముగ) శ్రీరామపదరజము సోకినవెంటనే శాపమును బాయుదువని మీతండ్రిగారు మీతల్లిగారికి గడువుఁబెట్టిరి. శతానందా! అట్టిరామమూర్తి నిందుకై తెచ్చిననన్ను స్తుతింప మఱచుట న్యాయమా ? (నవ్వును)

శతా—మీరునాకు బిత్రుసములు. మీదయ నెన్నఁడయినమఱతునా ? ఈమహోపకారమునకు మీ రేమూలము.

లక్ష్మ—(అపవారించి) అన్నయ్యా! కొంచెము మస్తిమితతగ నున్నట్లున్నా రేమి ?

రామ—విశేషమేమియు లేదు.

గీ. కత్తిపోటులు తనువును ♦ గాయపఱచుఁ;
దిట్టుపోటులు జీవంబుఁ ♦ దెగఁగఁజేయు
స్తుతులవేఁటులు చిత్తంబు ♦ తుఱుముసేయు
మెత్తనైన పదనునకె ♦ మిగులఁగోఁత.

లక్ష్మ—ఆతనికి జరిగిన మహోపకారముచే నాతఁడు తన కృతజ్ఞతను విశేషముగ వెల్లడించుచున్నాఁడు. మన్నింపఁదగును.

శతా—మాతల్లిగారు మాతండ్రిగారిగారి యాశ్రమమునకుఁ బోయిరా ?

విశ్వా—ఎప్పుడు రామభద్రుఁడు వచ్చునో, యెప్పుడాతని పదరజస్పర్శమున తాయి రమణియగునో యని నిరీక్షించుచుఁ దత్సమీపముననే గౌతమర్షి యున్నాఁడు. అహల్య నాతఁడే యాశ్రమమునకుఁ దీసికొనిపోయెను.

శతా—సంతోషము.

జన—శతానందగురువరా ! సాధ్యమయినంతత్వరలో మీ రాశ్రమమునకుఁ దయచేసి తల్లిగారిని దర్శించి సేవించి తిరుగ నిటకు దయచేయుదురుగాక !

శతా—అటులే.

జన—గాధినందనా ! అయిదవధన్యత యేదో యర్థావసరమున నానతిచ్చెదమని సెలవిచ్చితిరి. అదిసీతాకళ్యాణమునుగూర్చినదేయగు నెడల నేనత్యంత ధన్యుఁడనుగదా !

విశ్వా—శివధనుస్సు సజ్యము చేయుటకానిదే సీతకుఁ గల్యాణ మెట్లు ?

జన.—అదియే వచ్చిన పెద్దయుపరోధము. ఎటులో గిరీశ బాలుఁడు గకయోగ్యుఁ డగుట కొందఱు పనముగాఁ జేసి యుంటిని. ఎవ్వఁడు నాఁడివ్యథనుపును సమీపింపనైన నేరకున్నాఁడు. సీత కుమారుఁడు మహోత్సవమునకో యేమియుఁ దోఁచకున్నది.

లక్ష్మ—(తనలో) మాయన్నగారు హరధనుపును సజ్యము చేసిన బాగుగనుండును.

జన—

గీ. కన్యకళ్యాణ శుభవయః • కలితయయ్యె;
వరుఁడె కానంగబడఁడయ్యె; • హరునివిల్లు
వంపుమాట యటుండుఁడు • వనట నడుము
వాపు, సిగ్గునఁ దలవంపుఁ • బడుదునిపుడు.

విశ్వా—(తనలో) వరుఁడు గానఁబడఁడనుచున్నాఁడు. నిజమే! చక్షురతీత తేజస్సంపన్నుఁడగు శ్రీరాముఁ డట్టివాఁడే!

జన—

గీ. పచ్చతోరణ మెటుఁ గంటుఁ • బడిన సీత
పెండ్లియెపుడని నామోము • వెల్లఁబోవు
పేరణపుముబ్బు లెటులైన • వినఁగబడిన
దుహిత పెండ్లెప్పుడని గుండె • దుడుకులాడు.
బొమ్మలకుఁ బెండ్లిసలిపెడ • భుక్తికీపు
వేగరమ్మాయి జానకి • వింద్రఁ జెప్ప
నీకుఁ గలిగినయుచితత • నాకుగల్గ
దమ్మయనిలోన సిగ్గంది • యార్తిఁబడుదు.

కోడుకుకంఠెను గూఁతురు ♦ కూర్చువస్త్ర
నైన నద్దాని నేకష్ట ♦ మైఁబడుచుఁ
త్వరఁగ వదలుచుకొనుదాఁక ♦ దండ్రియోర్వఁ
డకట! యిదియేమిచోద్యమో ♦ యవనిమీఁద.
అమ్మలక్కలంద ♦ ఱంతఃపురినిఁ జేరి
యిఁక నూరకుంటి ♦ రేల యనుచు
నామరాణి నడుగ ♦ ఖేదావిలాస్యయై
పులుకుపులుకు నన్ను ♦ నలుకఁజూచు.

సీ. పెద్ద కన్నులవాఁడు ♦ ప్రియదర్శనమువాఁడు
పదునైదు పదునాఱు ♦ వయసువాఁడు
చాపకళాశాలి ♦ శాంతస్వభావుఁడు
వేదవేదాంగ సం ♦ విద్వరుండు
నిశ్చలతేజుఁడు ♦ నిర్మలరూపుఁడు
నిత్యసంస్మిత ముఖ ♦ నీరజుండు
లోకమనోహరుఁ ♦ డేకపత్నీవ్రతుఁ
డతులసత్యాఢ్య బా ♦ హాగ్గళుండు
నైన రాసుతుఁ గని జాన ♦ కమ్మనీవు
ప్రేముగ గ్రహియింపుమనుచుఁ బ్రా ♦ ర్థించుచుకును
హరధనుఃకార్య మొక్కటి ♦ యడ్డుదగిలె
నద్దినెఱవేఱు వెఱవేదొ ♦ యకట! యెరుఁగ.

లక్ష్మి—(తనలో) ఈరాజు మాయన్నగారినే యభివర్ణించుచున్నట్లున్నది. (ప్రకాశముగ) రామచంద్రా! శివధనుస్సు వంచు శూరుఁడే లేఁడని యీరాజు మిగుల పరితాపపడుచున్నాఁడు. మీరు వంచఁగలరని యీయనతో జెప్పుమని విశ్వామిత్రుఁడు తాతగారితో

నేను మెల్లఁగఁ జెప్పనా ?

రామ—(అపవారించి) తమ్ముఁడా ! నీకెందులకోయి ? ఊర కుండుము.

లక్ష్మ—(తనలో) ఈసమయమున విశ్వామిత్రుఁడేమియుఁ బలుకక యూరకుండెనేమో ? అదిగో ! ఏమియో చెప్పుటకు గాఁబోలు గొంతు సవరించుకొనుచున్నాఁడు.

విశ్వా—రాజేంద్రా ! ఆఁడుపడుచునుగాంచిన యాతనియార్తి యింతయని చెప్పఁదరముగాదు, కన్యకుఁ బెండ్లియగునంతమాత్ర మున నదిసరిపోవునది కాదు.

గీ. అత్తప్రీతియో, కోఁతయో ♦ యాఁడుబిడ్డ
బొమ్మబోధింపొ, సాధింపొ ♦ బోసిమామ
పెట్టొ, తిట్టొ పెద్దముఱంది ♦ వెలఁది నెనరొ,
కనరొ ; తోటికోడండ్రదొ ♦ కట్టొరట్టొ.
అన్ని యిట్లుండ నటుమీఁద ♦ నంతిపురని-
మగనిముద్దొ గుద్దొ పడు ♦ క గదిఁగునుకొ
కులటయొడిని గుటకొకూఁతు ♦ కుక్షియెండొ
నిండొ యని కన్నవారొందు ♦ నెగులదెంతొ !

లక్ష్మ—(తనలో)ఓస్ ! ఈమాట లెవఁడెఱుఁగఁడు ? ఇదియా యిప్పుడీతఁడు పలుకవలసినది !

జన—

గీ. ఏకకన్యఁగాంచి ♦ యెసఁగెడువానికే
యిట్టిబాధయనఁగ ♦ నింటనల్వు

రాఁకుబిడ్డలున్న • యాతనిబాధ యిం
కెంతయో యెఱుంగ • నెవనితరము ?

శతా—మిగిలిన ముప్వురినిఁగూర్చియు నంతచింత చే
సినపనిలేదు. వారిసంగతి లోకముతోఁపాటిదే యగును. జానకమ్మ
సంగతియే లోకాతీతమయినది. అదిమైన నీధనుర్వ్యవహారమున నట్లు
యినది.

జన—మహాత్మా! అందునుగూర్చియే యాందోళన మెక్కు
వగనున్నది. గాధిపుత్రా! శంకరచాపము సజ్యముచేయు నాతఁ
డెవఁడు లభింపకుండు నెడల నేమికావలసినది ? ఎంతకాల మందులకై
నిరీక్షింపవలసినది ?

లక్ష్మ—(తనలో) ఈసారి విశ్వామిత్రుఁడు మాయన్నగారిని
గూర్చిచెప్పకుండు నెడ నేనే తెగిపడి చెప్పెదను. ఏమి ? ఇంకను
విశ్వామిత్రుఁడు మాటలాడఁడేమి ? (లక్ష్మణుఁడు లేచును.)

రామ— (ఆతనిఁ గూర్చుండఁబెట్టి యూరకుండుమని సంజ్ఞ
చేయును.)

లక్ష్మ—(అపవారించి రామునితో) ఈరాజేంద్రునిమాటలు
నేను సహింపఁజాలను. ధనుస్సు వంచునాతఁడు లభియింపఁ డను
చున్నాఁడు. జగతి నిర్వీర్యమైపోయెననుకొనినాఁడా ? మహావీరులగు
మీయెదుట నీమాటలువిని నేనూరకుండఁగలనా ?

రామ—(అపవారించి)తమ్ముఁడా ! ఇదికోపమునకదనుకాదు,
మనగురువుగారే యుచితరీతిని జెప్పెదరు.

లక్ష్మ—(తనలో) నీళ్ళు నమలుచున్నట్లు మునిమాటలాడును
గాని విడఁగొట్టి తెగవేసి రెండు తునకలగునట్లు మాటలాడఁడు.

అదిగో! ఉపదేశముద్రను బట్టుచున్నాఁడు. ఏమి మాటలాడునో వినదము.

విశ్వా—రాజేంద్రా! నీకంతయాందోళనమక్కఱలేదు. ధనువును వంచుటకు శ్రీరామచంద్రుఁడర్హుఁడు.

లక్ష్మ—(తనలో) అద్ది! వినఁదగినమాటలు వినఁబడినవి.

జన—చిత్తము. అట్లైన నంతకంటె సంతోషమేమి?

లక్ష్మ—అట్లైన నను సందేహముతో నిమిత్త మేమున్నది?

విశ్వా—ఇందుకొఱకే రామునిటకె నేను దీసికొనివచ్చితిని.

లక్ష్మ—బాహుబలపరీక్షానన్ని వేశమిటనుంటచే రామభద్రుఁడిటకువిచ్చేసెను. కాని యనాహూతుఁడై ఈరాజునింటికేలవచ్చును?

జన—(అపవారించి) గాధినందనా! బాణాసురుఁడు, కార్తవీర్యార్జునుఁడు మొదలగు మహాభుజబలాఢ్యులు వింటినెత్త కదుపనే లేకపోయిరి. శ్రీరామచంద్రుఁడు చిన్నవారిలోమహాపరాక్రమశాలి. ప్రబలభుజాబల సంపన్నుఁడే కాని సహస్రభుజులకే యసాధ్యమగు నీ మహాకార్యము నిర్వహింపనోపునా?

విశ్వా—(అపవారించినవ్వుచు) ఓపునో లేదో చూడవచ్చును.

జన—ఇదిగో! మనము ముందుబాగుగ నాలోచించుకొనకుండ రామభద్రు నీపనికి బూనుకొనునట్లు చేయుట నాకిష్టములేదు.

విశ్వా—(అపవారించి) అట్లంటివేమి?

జన—(అపవారించి)మఱేమియుః లేదు,ఒకవేళ నాతఁడువిల్లెక్కుపెట్టలేకుండినయెడల సహస్రచంద్రమండలసంకాశమగు నాతనివదనమండలము చిన్నబోవదా? అట్టిమొగమును నేను జూడలేకుండుటచే

నిట్లు చెప్పుచున్నాను. కావున రామభద్రుండు విల్లువంపబూనుట నా కిష్టముగ లేదు.

విశ్వా—(అపవారించి) పణమును బెట్టుటవఱకే నీయిష్టము గాని యటుపైన నీయిష్టమేమున్నది ?

జన—(అపవారించి) అది నిజమేకాని యీధనుస్సు ప్రభావము శ్రీరామచంద్రునితో మీరిదివఱకు సెలవిచ్చితిరా ?

విశ్వా—చెప్పినయట్టులే చెప్పినాను. దాని నీవు వంపవలసి యుండునని నేను చెప్పలేదు.

జన—నేనిప్పుడు చెప్పనా ? మీరు చెప్పెదరా ?

విశ్వా—నీవు చెప్పకుండునెడల నాతఁడు పూనుకొనునా ? ఏమట్లు నేను చెప్పెదను.

జన—శ్రీరామచంద్రా ! గాధేయసవన సంరక్షకై యీదేశ ప్రాంతమునకువచ్చి పూర్వపుణ్యావశమున నాకు దర్శనమిచ్చితివి. మహానందభరితుఁడనైతిని. శివచాపము నెక్కు వెట్టినవానికినాకూఁతు నిచ్చెదనని దీక్షవూనియుంటినని యిదివఱకు జరిగియున్న మాటలవలన వినియుందువు. విల్లు వంచుటకుఁ గార్తవీర్యార్జునాది వీరులువచ్చి విముఖులైపోయిరి. ఆవిల్లువంచఁగల మహాపురుషుఁడెవ్వఁడునుగానఁ బడలేదు. రాక్షసక్షోదనదక్షాక్షీణభుజాబల విశేషుఁడవగు నీవిందు లకు సమర్థుఁడవయి యుందువుకావున—

విశ్వా—రామభద్రా ! అవశ్యము హరుచాపమును సజ్యము చేయుము.

రామ—రాజేంద్రా ! అనేకాస్త్రములొసఁగి యనేక శత్రులఁ గ్రటాక్షించి, యస్త్రాసురబలరహస్యములెన్నియో వెల్లడించి, తాను

నాకు సమీపముగ గూర్చుండి, చంపవలసిన నిముసమునుగూడ నిర్దేశించి, మాగురుఁడగు నీమహర్షి శిఖామణి రాక్షసుల నాచేఁజంపించినాఁడు. యథార్థముగ నాతనికి నాపైనున్న కటాక్షమే యసుర హనన కారణము కాని నాబాహువులలోనున్న సత్వముకాదు. ఇప్పుడుకూడ నామహానుభావుని కటాక్షమే కాలకంఠధనువును వంపఁగలదు.

జన—(తనలో) ఆహాహా! ఏమిసౌజన్యము!

లక్ష్మ—(తనలో) ప్రాణమైన వదలుకొనవచ్చునుగాని చేసిన గొప్పపని మని మెప్పును వదలుకొనుట యీతనికిఁదక్క మఱెవ్వరికి సాధ్యము.

శతా—ఆహా! శ్రీరామమూర్తి వంటినిరహంభావస్వభావునెచ్చటను గనివినియుండలేదు.

గీ. చేయకుండఁ జేసితినని ♦ చెప్పునాతఁ
డధముఁడు, రవంత చేసి కొం ♦ డంత చేసి
నాఁడననువాఁడు గర్వి, యెం ♦ తయొ యొనర్చి
సుంతఁజేసితిననువాఁడు ♦ సుజనుఁడిలను.
సర్వలోకోపకార వి ♦ స్తారకార్య
వారమొనరించి భగవంతు ♦ వైభవంబొ
శిష్టకరుణయొదానిని ♦ జేసెననుచు
తన్నుమఱచెడువాఁడెపో ♦ దైవమిలను.

జన—గురూత్తమా! బాగుగ సెలవిచ్చితిరి. అట్టిమహానుభావుఁడు హరధనువువంచి, నాకన్యనువరించి, నాచిత్తభేదమునువారిం

చినన్నుఁ గృతార్థుని జేయఁగలఁడని తోఁచుచున్నది.

విశ్వా—ఊహములతోడ నింకఁగాలక్షేపమేల? ఆధనువునిటకు దెప్పింపుము.

జన—ఇప్పుడేయీకార్యము జరిగింపుమని సెలవా?

విశ్వా—శుభము సంకల్పించిన వెంటనే జరుపవలసినదికాదా?

జన—చిత్తము. ధనువీ వెనుకనేయున్నది. సేవకా! ఈద్వారమును దెఱువుము.

(తెరయెత్తఁగఁ బుష్పమాలాద్యలంకృతంబగు నొక్కగద్దెపైహరధనువు గానఁబడును)

అందఱు—(లేచినమస్కరించి) ఓం! హరహర! మహాదేవ శంభూ!

లక్ష్మ—(తనలో) ఓస్! ఈమాత్రపుధనువునే యెవరువంచలేకపోయిరా?

జన—(రామచంద్రునిఁ గాంచుకొని) నాయనా! రామచంద్రా! ఇటువచ్చిదానిని సజ్యము చేసెదవా?

విశ్వా—రాజేంద్రా! ఉండు. రామచంద్రా! తొందరలేదు. జనకచక్రవర్తీ! జానకినిటకుఁ బిలిపింపుము.

రామ—(తనలో) ఆహా! నామనసులోని యూహ మీనోట నుండి వెడలినదికదా! మహాత్మా!

జన—గాధినందనా! రాణివాసమున నున్న జానకియిట కేల?

విశ్వా—తండ్రియొద్ద రాణివాసమేల? ఈముసలిమునిముచ్చుల యొద్ద రాణివాసమేల? భర్తయొద్ద రాణివాసమేల? పుత్రిఁజైన

సౌమిత్రియొద్ద రాణివాసమేల?

లక్ష్మ—సెబాస్ ! గురూత్తమా ! బాగుగఁబలికితివి.

రామ—(తనలో)ఆహా ! మునీశ్వరా ! నీవాక్యమమోఘము కదా !

జన—

సీ॥ భర్గచాపమింక ♦ బల్లపైనుండఁగ
భర్తయనుచు రామ ♦ భద్రునంటి
భవసమాన తేజ ♦ భవదీయ వాక్యంబు
బహుళభవ్యభార ♦ భరితమయ్యె.

సేవకా ! జానకి నిటకుఁ బంపుమని రాణిగారితోఁ జెప్పుము.

రామ—(తనలో) హృదయమా !

గీ. భైరవాకార రాక్షస ♦ వీరదర్శ
నమున నిసుమంతయును బెం ♦ దరకయుండి
మృదులమృదులాంగి సీత నీ ♦ క్షింపఁదలఁచి
తొడికెదేల యప్పుడే మెత్త ♦ బడెదవేల ?
ఇలను సుఖదుఃఖ భాగార్హ ♦ ములకు శాశ్వ
తముగ సీతోడ గూర్పు కోఁ ♦ దలఁచినట్టి
సుదతివచ్చు దపఁబడక ♦ చూడుమయ్య
ప్రథమదర్శనమతి కృతా ♦ ర్థంబుగాదె ?

[జానకియు మృదులయుఁ బ్రవేశింతురు.]

జాన—ఎవ్వరో క్రొత్తవారునున్నట్లున్నారు (పోఁబోవును.)

రాము — ఆహాహా !

జన — (ముందునకుఁబోయి జానకిని బట్టుకొని) అమ్మా! పోనక్కఱలేదు, ఈతొతల నెఱుఁగనే యెఱుఁగుదువుకదా ! ఆరాజ కుమారులలో

గీ. పోకమాఁకుఁబోలెఁ ♦ బొడుగైనవానిని
పచ్చనైన పట్టు ♦ బట్టవాని

తల్లీ! తలవంచుకొనెదవేల ? (గడ్డముపట్టుకొని) ఇదిగో! చూడు.

మొయిలు హొయలు మేని ♦ ముదిపముల్గలవాని
పరమతేజమైన ♦ వానిగనుము!

జాన — (తనలో) కన్నులు మూసికొనినను నావఁహాము హుని దివ్యతేజము రెప్పలగుండ కన్నులలోఁ బ్రవేశించి యొడలంతఁ బ్రకాశింపఁజేయుచున్నదే! ఇచ్చట సాక్షాత్కరించినది నాతపఃఫల మైన దైవమైయుండునా ?

రాము — (తనలో)

గీ. మేఘమిచటనుండ ♦ మెఱుపచ్చటనునేల
ఈవిచిత్రచాప ♦ మేల నడుము !
భవునిధనువుఁ దేగ ♦ వంచితో త్రెంచితో
నిన్ను నన్ను నన్ను ♦ నిన్నొనర్తు.

జన — అమ్మా! నేజెప్పినకాంతిని జూచితివా ! మాటలాడ వేమిజానకీ?

జాన — అబ్బా! ఎదులకు !

జనక — అదేమి ? కన్నులట్లు మూసికొందువేల ?

జాన — (తనలో) గోనంబ్రవేశించిన యీమహానీయ తేజోరాశి తిరుగఁ బైకిబోవునేమోయని వెఱ్ఱిపడి కన్నులు మూసికొంటినిగాని తెప్పలు దూరి లోఁజొరఁబారిన కాంతి తెప్పలు తెఱచిన నైనఁ బోవునా? (కన్నులు తెఱచును)

జన — అమ్మా! కన్నులు తెఱువుము సిగ్గుపడక చూడుము. ఇతఁడె దాశరథి రామచంద్రుఁడు (నవ్వుచు) ఆతఁడు నిన్నుఁ బెండ్లి చేసికొనునఁట. ఏమందువు?

జాన — (నిమ్మళముగ) హరధనువుమాట?

లక్ష్మ — (తనలో) సెబాస్! మీఁకన్యకా! మా రామచంద్రునకు నీవే తగుదువు.

రాము — (తనలో) హరధనువు నందిన తరువాత నే

జాన — తండ్రీ! నన్ను వదలుము. (జానకి మృదులను జేరును.)

మృదుల — (అప) సీతమ్మా! ఎంత యదృష్టవంతురాలవమ్మా!

జాన — (అప) చూడు. చూడు. మా చెల్లెలూర్మిళకు సౌమిత్రి మిక్కిలి తగియున్నాఁడు సుమా!

మృదుల — అమ్మా! నీ పెండ్లి కాకుండనే నీ చెల్లెలికిఁ బెండ్లి జేరపు మాటలా!

రామ — రాజేంద్రా! గురూత్తమా! ఇంక ధనువు నొద్దకు వెడలవచ్చునా?

విశ్వా — అభ్యంతరమేమి?

రాము — తమ్ముఁడా! ఈవిల్లు నీయొద్దనుంచెదవా?

(ఇచ్చి ధనువున్న యొద్దకు నిమ్మళముగఁ బోవును)

జన — (తనలో) అన్నియు ననుకూలముగ నున్నది. ఈధనుస్సేమి చేయునో?

గీ. హర ! శశాంక రేఖాధర ! యాశ్రితార్తి
హర ! యెప్పుడు నైహికపు దేవులాట నడుగ
నెదియు నొకటికోరెద క్షమి యింపు మిపుడు
సీత రామున కిల్లాలిఁ జేయుమయ్య.

రాము—(గద్దెనుఁ జేరి ప్రదక్షిణమునుఁ జేయును.)

హర ! త్రిపురహర ! గజదైత్య హర ! పదాబ్జ
భక్తకృతపాపచయ హర ! ప్రసవబాణ
విపులమద హర ! భూమీశకృతపవనహర ?
ఏను నీవిల్లువంతు క్ష మింపుమయ్య.

జాన—(తనలో) రామప్రభూ ! మీకులదేవతలు మిమ్ముల సఫలమనోరథులఁ జేయుదురుగాక !

రాము—(తనలో) విల్లెట్లు వంచెదనోయని జానకి నన్నుఁ జేగ్రంటఁజూచుచున్నది. ఆహా! కృతార్థుఁడనుగదా! (ప్రకాశముగా) విల్లందుకొనుటకనుజ్ఞయేకదా ?

విశ్వా—హరప్రసాదోస్తు.

రాము—ఇదుగో. (పూలమాలికను జేతితో నెత్తును.)

(లక్ష్మణుఁడుతక్క నందఱు నవ్వుదురు.)

లక్ష్మ—ఆహా ! ప్రమాదము. రామమూర్తి సీతాకుసుమకోమలవిన్యస్తహృదయాబ్జుఁడై పుష్పమాలిక నెత్తెనుకాఁబోలు. (కోపముతో) ఆయనయభిప్రాయము నెఱుఁగకుండనట్లైనవ్వుటన్యాయమా? రాజేంద్రా ! నీవామాలికఁ దీసికొని శ్రీసీతాదేవికిమ్ము దాని నేమి చేయవలయునో ఆమెయే యెఱుఁగును.

జన—(తీసికొని) అమ్మా ! ఇది తీసికొనుము.

రాము—(ధనుస్సును రెండు చేతులతో నెత్తును.)

జనక—ఆహా! ఆహా! ఈమాత్రము చేయఁగలిగితివి. ఇంక వంచినట్లే.

సీత—(అప. మృదులతో) కార్తవీర్యార్జునుఁడుసహస్రబాహువులతో గింజుకొనిన నొక్క కోటిసైన లేచినది కాదు.

విశ్వా—రామచంద్రా! ఏల సందేహింతువు?

రామ—మహాత్మా! విల్లు మిగుల పాతది, బెండువలె నున్నది. వంచుమని యనుచున్నారు. ఏమియగునోయని సంకోచించు చున్నాను.

జన—సెబాస్! మహావీరాగ్రణీ! సెబాస్! లోకోత్తర సత్ప్రభావా!—

సీత—(తనలో) సందేహింపకుము—వంచుటనీశక్తి నిఁబరీక్షించుటకొఱకుగాదు. లోకులకు నీప్రభావముఁ దెలియఁజేయుట కొఱకు కాదు. నన్నుఁజెట్టపట్టుటకొఱకు. శ్రీరామచంద్రా! వేగమువంచుము. వడఁకుచున్న గాలు సేతులతో జాల సేపు నిలువబడ లేకుంటిని.

రాను—(వింటి నెడమ చేతఁగొని నారి నెక్కు వెట్ట టప్పుమను ధ్వనితో విల్లు పగులును.)

జన—విఱుచుట వంచుటకంటెఁ బైమెట్టుకదా! (సీతవంకఁ దిరిగి) అమ్మా! చూచెద వేల?

సీత—(పఱుగునవచ్చి రాముని మెడలోఁ బువ్వ మాలికను వైచును.)

విశ్వా—జయూ! కల్యాణరాఘువా!

జన—జయూ! కల్యాణరాఘువా!

శత — జయా! కల్యాణరాఘవా!

లక్ష్మ — జయా! కల్యాణరాఘవా!

జాన — తండ్రీ! నేనింక మాయమ్మయొద్దకుఁ బోవుదును.

(పోఁబోవును.)

జన — అమ్మా! కొంచెముసేపువలకుండుము. మృదులా! నీవు లోని మంగళపుటారతి పళ్ళెరమును వేగఁ దెమ్ము (మృదులపోవును)

విశ్వా — అర్ఘ్యావసరమున నయిదవధన్యత యేదియో చెప్పెద నంటివే! అది యిదియే.

జన — మహాత్మా! ఈశుభమునకంతయు మీయనుగ్రహమే మూలకందము.

శత — ఒకని యిల్లు నిలువఁ బెట్టినసుకృత మెంత సద్యఃఫలప్రద మయినది!

రాము — తమ్ముఁడొక్కఁడును గొలఁదిదూరమున నిలువఁబడినాఁడు. నేనాతని నింకఁ జేరవచ్చునా?

జన — ఇదిగో! వధూవరులకు నివాళులయినపిమ్మట—

(మృదుల పళ్లెరముతోఁ బ్రవేశించును.)

మంగళపుటారతి — సురట.

మృదుల — మంగళం శ్రీజానకీరాములకు మంగళం
జనక కనకరాశిజానకికి, జలజాప్తకులరామచంద్రునకు, మానితశుభ
గుణమాణిక్యములకు మీకు మంగళం
హాటకహారి దేహలతకు తాటకమరణ సంధానునకు । పాటలాధర
మణి భాసితులకు మీకు ॥మంగళం॥

పురహరభక్తుని పుత్త్రికకు హరచాప సంపాటనాధ్యునకు । కర
మరుదగు నఘావరులగు నిగుపునకు ॥మంగళం॥

రాము—తన మెడలోని రత్నహారమును దీసి పళ్ళెరములో నుంచును.

జనక—మృదులా! బాగుగ బాడితివి. శివభక్తుని పుత్త్రికకు శివధనుఃఖండనునకుఁ గల్యాణముగుటచేతనే నఘావములు కరమరుదగువారుకారు. అయోనిసంభవకు నహల్యాచాపవిమోచనునకుఁగల యిక గలుగుటచేననికూడ చెప్పవచ్చును.

మృదు—చిత్తము! ఇదిగో! ఈరత్నహారము మీయల్లుఁడు గారు నాకుఁ గటాక్షించినారు.

జన—అల్లుఁడుగా రిచ్చినారనఁగ గూఁతు రీయలేదనియా? అమ్మా!

జాన—(ముత్యాలహారమిచ్చును.) తండ్రీ! నేను లోనికేగెదను. (మృదులతోఁబోవును.)

రామ—(అపవారించి లక్ష్మణునిఁ గౌఁగిలించుకొని) ఈరాజేంద్రునికింకను గూఁతులున్నారఁట కాదా—సిగ్గుపడెదవేల? తమ్ముఁడా!

విశ్వా—ఊర్మిళా, మాళవీ శ్రుతకీర్తులను లక్ష్మణ, భరత, శత్రుఘ్నులకు వరుసగనిచ్చి సీతాకల్యాణముతో నీమూఁడు వివాహములు శీఘ్రముగఁ జేయుము.

జన—మహాభాగ్యమును స్థిరపఱచెదను. దశరథునితో నిల్లు వియ్యమొందఁగలభాగ్యము మీకరుణచే లభించెను. వెంటనే శుభలేఖలను వ్రాయించి దశరథమహారాజునకుఁ బంపించెదను.

విశ్వా—తథాస్తు. మేముమానివాసములకిఁకఁ బోయెదము. జానకీరామా! రామానుజా! నావెంటరండు.

జన—(రామలక్ష్మణులఁ గౌగిలించుకొని) వెళ్ళుఁడు. (విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులతో నిష్క్రమించును)

శతా—నేనాశ్రమమునకుఁ బోయిమాతల్లిగారిఁ గాంచెదను.

జన—చిత్తము. (శతానందుఁడు పోవును)

గీ. వృక్షమునభీతినొకపక్షి ♦ యెగిరిపోవ
నన్నిపక్షులు నెగిరిన ♦ యట్లుగాగ
చిత్తమునఁగల్గునొకచింత ♦ చెదరిపోవ
చింతలన్నియొకప్పుఁడు ♦ చెదరిపోవు ॥

అంతఃపురమీదినమున నెంతకలకలలాడుచుండును!

గీ. అంతిపురిరాణిమున్నటి ♦ హాస్యహాస్య
లన్ని 'యహాహా' లుగామారు ♦ నందుఁగాదె
అమ్మలక్కలమున్నటివైన ♦ బుగ్గపోట్లు
ముక్కువేళ్ళులుగనుమారి ♦ పోవుఁగాదె.

ఈవినోదమును నేను గూడఁజూచెదను.

(నిష్క్రమించును.)





శ్రీ

# కల్యాణరాఘవము.

## షష్ఠాంకము.

ప్రదేశము—సాకేతపురము.

ప్రవేశము—శంకరుఁడు.

శంక—ఇచ్చినాఁడు ఉల్లిపొరవంటి యొక్క గుడ్డ. చేసినాఁడు నాల్గుపెళ్లిండ్లు నాల్గుకుంచముల నిర్భాగ్యము మూటఁగట్టుకొనుటకి బుట్టియున్న గుడ్డ నీయకపోయిన నేదేవుఁడిచ్చినాఁడు. నారాయణా! నారాయణా!

నార—(ప్రవేశించి) ఏమోయీ! శంకరా! ఏమి చేయుచున్నావు?

శంక—ఏమున్నది? ఏడ్చుచున్నాను. వసిష్ఠగురువుగారిశిష్యుఁడను వియ్యంకునిగారిగురువుగారి శిష్యుఁడనుగదా! ఆమాత్రపుఁజిన్న పెద్ద తాంతవ్యమెక్కడ లేదా? ఇదిగో! ఈగుడ్డ నా జనకచక్రవర్తి నాకిచ్చుట! చనువులో గట్టిలేకపోవచ్చునుగాని యాశ్రయించిన కొమ్మ గట్టిదే కాదా! నీకేమిచ్చినాఁడు?

నారా — రెండు కాశ్మీరపు సేలువలిచ్చినాఁడు. మూఁడుపట్టు గోముఖములిచ్చినాఁడు. రెండు మృగచర్మము లిచ్చినాఁడు. రెండు పావుకలజోళ్ళ నిచ్చినాఁడు. ఇంక నేమేమో—

శంక — ఇయ్యఁడా మఱి—మీగురువుగారు మాఱమేకు. మా వసిష్ఠయ్యవట్టి మేకుముక్క! శిష్యునకు సరియైన బహుమానకృతినీయని యెడలఁ దనకిచ్చిన బహుమతులఁగూడ గిరగిర ద్రిప్పి యిచ్చినవాని మొగము మీఁద గొట్టు నిర్భయస్వభావముగల వాఁడు మాగురుఁడు. ఇఁక మా యయ్యవారు తనకీయకున్న సరే. తనశిష్యునకీయకున్న సరే. కనికారము లేదు మొగమాటము లేదు. మా పెఱుఁగు లేదు. మాటమెలుకు లేదు.

నారా — అట్లంటు వేల? మనగురువులను బట్టి మనకిచ్చినారా! పండితసంభావనకు నీవు నేనుఁగూడ సిద్ధపడితిమి. పరీక్షాధికారులు నాకొసఁగవలసినట్లు నాకొసఁగినారు. నీకీయవలసినట్లు నీకిచ్చినారు. ఇది జనకచక్రవర్తిగారి కేమి తెలియును ఇందులో మనగురువుల కేమి జోక్యమున్నది. వెనుక నేమైనను నిన్న జరిగిన గృహప్రవేశమహోత్సవములలో నీకమూల్యబహుమానకృతులు లభించినవి కావా?

శంక — నల్లగుఱ్ఱముకుల పెండ్లిండ్లయ్యెను; నల్లురుకోడండ్రింటి కొక్కసారి వచ్చుటయ్యెను నేను కులపురోహితుని శిష్యుఁడనైతిని. గృహప్రవేశోత్సవములలో నామాత్రపు బహుమానములైన నాకు లేకుండవలయునా? మా విశ్వామిత్రగురువుగారు మిథిలాపురమునుండి తిన్నగఁ దనయాశ్రమమునకే పోయెదనంటిరి కాదా? సాకేతపురమునకుఁ దిరుగ నేల వచ్చినారు?

నారా — మా రాజుగారి బలాత్కృతిచేత యిచ్చటి వేడుకలు చూచుటకు వచ్చినారు.

శంక—అవి యయినవికావా ?

నారా—ఈదినమే ప్రయాణము. రాజుగారియొద్ద సెలవు తీసికొనుటకు వెళ్ళినారు.

శంక—మాగురువుగారుకూడఁ గోటలోనేయున్నారా ?

నారా—లేరు.

శంక—అటులైన వెంటనే యాయన పరిచర్యకై నేను బోవలయును.

నారా—నేను గోటముందుఁ గనిపెట్టియుండి రాజుగారితో మాటలాడిరావేగమే మాగురువుగారిని గలిసి మాయాశ్రమమునకుఁ బోయెదను. సెలవు.

శంక—మంచిది ; దయయుంచుము.

(నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.



# షష్ఠాంకము.

———o———

ప్రదేశము—రాజసభ.

ప్రవేశము—దశరథుఁడు, విశ్వామిత్రుఁడు.

విశ్వా—ఊఁ! హుఁ! ఊఁ! హుఁ!

దశ—ఇఁక లెక్క మూఁడు దినములు మాత్రమున్నవఁట.

విశ్వా—ఇఁక నాఁగ వీలులేదు. పదాఱేండ్లు గడచినదాఁకనైన రామలక్ష్మణుల నీవు నాకిచ్చినవా? ఉయ్యూరుగ వచ్చితివి. కాలాంతకాల మయినది.

దశ—నాదాతృత్వ మంతగ నక్కఱలేదు. నేను మీయెడలఁ గఠినుఁడగు ఋణప్రదాతవలె నాచరించితిని.

విశ్వా—ఏల?

దశ—రెండువస్తువులు మీకప్పనిచ్చితిని. తిరుగ నాలుగువస్తువులఁ దీసికొంటినిగాదా!

విశ్వా—ఇచ్చిన యసలు మొత్తమునే భద్రముగ నీకుఁ దిరుగ నీయలేనని మొదటఁ గొంత జడిసితివి కావా!

దశ—క్షమింపవలయును. మీప్రభావ మెఱుఁగక—

విశ్వా—కాదు. రామచంద్రుని ప్రభావ మెఱుఁగక యనుము. అతఁడు పరశురామగర్వభంగ మెంతవిలాసముగఁ జేసెనో కన్నారఁ జూచితివికాదా!

దశ—మహాత్మా! చూచితిని. ఇప్పటికా సన్నివేశము తలఁచుకొన్న నొడలు గగురుపొడచుచున్నది.

విశ్వా—పుత్రీమాహాత్మ్యముచే ఘనతనొందు తండ్రులలో నీవు పరిపరిపూర్ణుఁడవు. ఉత్తమోత్తముఁడవు. జ్ఞానమునఁబట్టియే కర్మమున కాధిక్యము.

దశ—నేనే మీవెంటవచ్చి యీయాదు నెడలఁ దాటకాదులఁ జంపి సరుగ గౌతమకాంతాశాపవిమోచనముఁ జేసియుండఁగలనా!

విశ్వా—ఇఁక నట్టి మాటలేల! నేనిప్పుడే బయలుదేఱి మాయాశ్రమమునకుఁ బోవలయును

దశ—ఒక్క అరగడియసేపయినను నుండరా?

విశ్వా—నీయిష్ట మెంత సేపుకూర్చుండుమనినఁ గూర్చుండవలయు ననియే యుండును. కాని ప్రయాణముహూర్తము సమీపించినది. పోవలయును.

దశ—నమస్కారము.

విశ్వా—కల్యాణమస్తు. అయిన నిక్కడ నింక నేనుండి చేయవలసిన దేమున్నది.

దశ—సమకూర్పవలసిన శుభములన్నియు సమకూర్చి నేకూర్చినారు. ఒక్కటున్నది.

విశ్వా—అదేమి?

దశ—నేను పెద్దవాఁడనైతిని. రామచంద్రునకుఁ బట్టాభిషేకము చేసి నేను మీవెంటనే మీయాశ్రమమునకు రానెంచితిని. అందుకొఱకే మిమ్ము మూఁడు దినములు నాగుఁడని నేను ప్రార్థించితిని.

విశ్వా—అగ్నిసమయమున నదియునగును. తొందరయేల?

దశ—తలఁచుకొనిన పని యెంతత్వరగ నైననంత మంచిదికాదా?

| | | | |
|---|---|---|---|
| 51 | 16 | జిన్న | చిన్న |
| ,, | 4 | నేన | నేను |
| ,, | 14 | ప్రథమ | ప్రథమ |
| 53 | 5 | నెటువచ్చు | యెటువచ్చు |
| ,, | ,, | జాయాప | జయాప |
| 54 | 7 | నేనుపోయి | నేనఁబోయి |
| 55 | 24 | సమర్థత | సమర్థత |
| 56 | 24 | సాహాయ్యార్థము | సాహాయ్యార్థము |
| 57 | 5 | నవ్వుతున | నఁదన |
| ,, | 15 | నాఁడత | నాఁడెఁద |
| 58 | 22 | తరువాఁకొంచె | తరువాతఁగొంచె |
| 59 | 21 | వదాన్యాగ్రణుఁడె | వదాన్యాగ్రగణ్యుఁడ |
| 60 | 10 | తసలో | తనలో |
| ,, | 13 | భ్రాన్తించితి | భ్రాన్తించితి |
| 63 | 16 | గాథి | గాధి |
| 65 | 10 | నిటు | యిటు |
| 66 | 2 | గమ్రిముగఁను | గర్విముగఁ |
| 67 | 11 | వృద్ధునకు | వృద్ధునకు |
| ,, | 13 | ,, | ,, |
| 68 | 1 | విశ్వా-విత్వా! | విశ్వా-విత్వా! |
| ,, | 11 | బలుక | బనిపలుక |
| ,, | 14 | వృద్ధు | వృద్ధు |
| 71 | 9 | వృథ | వృథ |
| ,, | 16 | గచ్చ | గ్రచ్చ |
| 72 | 17 | విర్వా- | విశ్వా- |
| 76 | 11 | గాఁక | గాఁగ |
| 79 | 1 | సంధ్య | సంధ్య |
| ,, | 4 | వేచి | లేచి |
| ,, | 17 | లక్ష్మి- | లక్ష్మి- |
| ,, | 21 | సాధుని | సాధుని |
| ,, | 22 | జూమటకే | జూపుటకే |
| 80 | 15 | బుంజాలు | జంజాలు |
| 81 | 19 | వృధ | వృథ |
| 82 | 16 | త్రేవు | త్రేవుల |
| ,, | 23 | గొట్టుకొనుటకుఁ గాదుకానిపండ్లు కుట్టుటకు | గొట్టుటకుఁ గాదుకొని, పండ్లు కుట్టుకొనుటకుఁ |

| | | | |
|---|---|---|---|
| 83 | 2 | చేష్టలు | ఁజేష్టలు |
| ,, | 12 | కాళ్ళ | కాళ్ళ |
| 84 | 22 | పెట్టుకొన్న | ఁబెట్టుకొన్న |
| 86 | 16 | యాకాన | యాఁగాన |
| 87 | 11 | సుబాహుఁడా! | సుబాహుఁడా! |
| 91 | 5 | శుద్ధ | శుద్ధి |
| 92 | 4 | చెప్పితివా? | చెప్పితివా? |
| 94 | 1 | పాలుంలు | పాఁపులు |
| ,, | 7 | గారిగారి | గారి |
| 97 | 16 | గులుకా | గులుకా |
| 98 | 2 | తనయు | అరయు |
| 100 | 7 | చెప్పిన | చెప్పిని |
| ,, | 8 | చెప్ప | జెప్ప |
| ,, | 14 | పంచుఁగల | సంపఁగల |
| 101 | 3 | యుధార్థ | యథార్థ |
| ,, | 8 | ముని | పలని |
| ,, | 14 | యెనర్చి | యొనర్చి |
| ,, | 18 | నను | ననుఁ |
| ,, | 19 | తెన్ను | దన్ను |
| ,, | 21 | ఖేదము | ఖేదము |
| 102 | 1 | కృతార్థుని | కృతార్థుని |
| 104 | 6 | పచ్చినేన | బచ్చినైన |
| ,, | 9 | పరము | బరము |
| 105 | 6 | దాశరధి | దాశరథి |
| 106 | 10 | కాన | జాన |
| ,, | 19 | నాపుసూజ్ఞ కాఁబోలు. | నాపుసూజ్ఞ గాఁబోలు. |
| ,, | 22 | అము | యాము |
| 107 | 14 | కాదు. | ఁగాదు. |
| 109 | 7 | కాప | శాప |
| ,, | 8 | చెప్పవచ్చును | ఁజెప్పవచ్చును. |
| 112 | 17 | నేనుబల | నేనుబల |
| 115 | 2 | ప్రభుఁడవు | ప్రభుఁడవు. |
| ,, | 15 | కూర్చు | కూర్చు |
| ,, | 18 | పెద్ద | బెద్ద |

☞ 110 పుట, 12, 13 పంక్తు లిట్లు చదువుకొనవలెను

అమ్మ లక్కలు ముప్పొట ♦ నైన బుగ్గ
పోట్లు ముక్కు త్రేళ్లుగమారి ♦ పోవుఁగాదె